శ్రీరస్తు.



# శ్రీకృష్ణకల్యాణము.



ఇది

శ్రీమదల్లమరాజు సుబ్రహ్మణ్య కవివరునిచే

రచియింపఁబడి

కాకినాడపుర వాస్తవ్యులగు

బచ్చు రామేశము గారికి

అంకితము చేయఁబడి



సుజనరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.

కాకినాడ

1898

కలియుగ గతాబ్దంబులు ౪౯౯౯ అగు విళంబి సంవత్సర జ్యేష్ఠ మాసము

శ్రీరస్తు.



# శ్రీకృష్ణకల్యాణము.

## ప్రథమాశ్వాసము.

శా॥ శ్రీలీలందగుమాధవుఁడనుచుఁ దన్ సేవించు బృందావన
శ్రీలోనాఁబొడచూపి గోపికలుగూర్మిన్ వేఁడఁ గ్రీడారతిన్
లేలంగైకొను కాకినాడనగరి శ్రీవేణుగోపాలకుం
డేలుంబచ్చకులాబ్ధి శీతఘృణి రామేశార్యచూడామణిన్॥

మ॥ తతతారుణ్య విలాసకాంతమునికాంతా తారకావారసం
వృతుఁడై కోరికదారుకావననభోవీధిన్ సుధాచ్ఛస్వదీ
ధితిబర్వంగఁ దదీయకేళికలనందేలన్ జగన్మోహనా
కృతియాసోముఁడొసంగుసంపదలు రామేశార్యధీశాలికిన్॥

ఉ॥ ఆశిశిరాద్రిరాజ శిఖరాంతర సారధునీ ప్రవాహనీ
కాశములయ్యెనీకుచచకచ్చకితద్యుతిహార ప్యంక్తులౌ
నాశుభవాణియంచుఁ జెలిన్నలిఁగౌఁగిటఁ జేర్చుధాతరా
మేశమహావదాన్యునకు నీవృత దీర్ఘతరాయురున్నతుల్॥

సీ॥ తెలివాలుకనుడాలు బలువాలుగులచాలుగా నాభియావర్తగతినెసంగ
నతిఁజెందగళసుందరతచిందమురుచిందనరజంఘులుమకరీస్ఫురణనమర
వళులంగలహొరంగతుళమంగళతరంగములుగనంఘ్రులుకమఠులుగనలర
ఘనలాలితగుణాళిగడుమేలిమణిపాళిగా భావముగభీరగరిమఁజెలఁగ
జనకుపోలికగలకలశజలరాశి । కన్యసామోదరసముసత్కవివరాళి
కలకలమునైనరామేశఘనుని గృహము । నిజగృహంబంచుసతమందనిలుచుఁగాత॥

మ॥ చెలువౌపత్రయుతస్తనస్తబకముల్ సెబ్బెంపుమాధ్వీరుచిం
జిలుకంగోమలపాణిపల్లవరుచుల్ జెన్నారవీక్షాళిమం

డలియొప్పఁగ శివచందనద్రుమమునంటంబ్రాకితారాద్రిలో
నలలోనందగుకల్పవల్లియనుచునార్యేశవైశ్యాగ్రణిన్ ॥

మ॥ లలనానీకుచవక్త్రకేశ్యములఁబోలంజాలు శైలేందుమం
డలనీలాభ్రములన్ సృజించితినివేడ్కంజూచితేయన్నవా
నిలలిన్నున్నగనావిచూచియొకదానిన్నెంచితీవంచుఁడా
నలువన్నవ్వెడువాణిమత్కృతిసభన్నాట్యంబుగావించుతన్ ॥

ఉ॥ శాయకకుంభకూటములబంధురపాళినవాంబుదంబుగా
నాయతగండభాగములయందు మదాంబుఝరంబులొప్పఁజెం
పైయలదంతకాంతులొలయంగమహోముఖగహ్వరంబుతో
నాయమరాద్రివోలెడిగజాన్యునిఁగొల్తునభీష్టసిద్ధికిన్ ॥

చ॥ నిగమమయాత్మతేజమునవిచ్చలులోకతమంబువాపిచే
ల్వగుకరరేఖలొప్పవినతాభిహితార్థవిధాయియైతిరం
బుగజగధీశ్వరున్ హరినిమెచ్చినయాఖగరాజు శ్రీదలి
ర్పఁగనిరతంబుశోభనపరంపరలీకృతిభర్తకీవుతన్ ॥

సీ॥ వల్మీకజవ్యాసనాగభ్రిగంగామహోర్మిమాలికలలోనోలలాడి
కాళిదాసమురారికావ్యనవ్యామృతధారాపరంపరల్ దనియగ్రోలి
భవభూతిమాఘభారవివచోరచనాచమత్కారములకుసమ్మదముగాంచి
బాణమయూరసుబంధుప్రబంధమరందరసాప్తికానందమొంది
భానుసామిల్లిబిల్హణప్రతిభమెచ్చి । సారమతినన్నయార్యునిశంభుదాసు
దిక్కయజ్వని శ్రీనాథుధీరుఁబెద్ద । కవినిభీమునిసోమభాస్కరులఁదలఁచి॥

ఉ॥ బోధకుఁడైకృపన్ననుఁబ్రబుద్ధునిఁజేసినసర్వసత్కళా
శ్రీధరునాగభట్టునరసింహసుధీమణినాంతరాచ్యుతా
రాధనునోగిరాలకులరత్నముసత్కవితానిధిన్ జగ
న్నాథకవీంద్రువిద్వదభినంద్యమదిష్టసఖున్నుతించెదన్ ॥

గీ॥ శుభ్రవర్ణలసత్పదస్ఫురితగతులు । సుకవిమణివోలెఁగాకవిసూపఁగలఁడె
శుభ్రవర్ణలసత్పదస్ఫురితగతులు । సుకవిమణివోలెఁగాకవిసూపుబెట్లు॥

వ॥ అని యిష్టదేవతావందనంబును సుకవిబహూకరణంబునుఁ గుకవి నిరాకరణం
బునుంగావించి విరించనజనకప్రపంచిత కథాసుధాంచితంబును నవరసభావా

బంధబంధురంబుగా నొక మహాప్రబంధంబును సంధింపంబూనియున్న సమయం బున॥

సీ॥ రావించెనేమహారసికుండు గజపతిప్రముఖులందనసౌధ రాజమునకు
సేవించెనేమనస్విసదాశివునిబిల్వపత్రకోటీసమర్పణమొనర్చి
కావించెనేకృపాకరుండుకర్పూనలక్షధరణీసురులకన్నదానతుష్టి
భావించెనేగుణాస్పదుండుశాంభవరూపమనుపమకోటిలింగార్చనమున
ఘటనమొనరించెనే ప్రౌఢకాకినాడ । వాడవాడలవారికవ్వారిగాన
వారితసుధాప్తగాతమీవారిసారి । ణులనతండెసంగురామేశలలితయశుండు॥

వ॥ వెండియు నతండఖండ నిజమనీషా విశేష శేష సంధానిత ధృతిమంధాన గిరి మ ధ్యమాన నానాంతరీప సంక్రాంత వివిధవ్యవహార పారావార సముత్పన్న శుభ లక్ష్మోన్నత లక్ష్మీసహజాయమానానుపమాన నిజానవరతదాన కళానాయక ప్రకాశ సంతర్పిత సకలసుకవి నికరచకోరవారుండును, మేరుధారుణీధర సమా నధీరుండును, భూనభోంతర పరిపూర్ణ వర్ణనీయ నిజయశస్సరోవరోపరివికస్వర తారాకైరవ వనాభ్యంతర నిరంతర విహరమాణ రాజహంసాయమానత మీన మండలుండును, నమేయతర జగజ్జేగీయమాన సంపదా భోగభోగాఖండలుం డును, సత్యనటన ప్రవీణ హరిణాంకప్రభుస్తవనీయ తదీయ భాషా వ్యాపార పారీ ణుండును, బుధమతానుగుణ సుగుణ మణిగణాభరణ ధురీణుండును, కాకినాడ నగరప్రతిష్ఠిత నిరతాన్నదాన సత్రుండును, నిమ కులగోత్రపవిత్రుండును, విఖ్యా తభూత దయాళుతాస్పద సదమల హృదంతర సంతతస్థిరీకృత హరిహరాభేదభా వనుండును, జెగ్గమాంబా గర్భపావనుండును, నిఖిలాశ్రితజన ప్రమదవన చైత్రుం డును, బచ్చువంశకలశార్ణవపూర్ణకుముదమిత్రుండును, వినయసౌజన్యమాన్య స్వ భావభాసురుండగు రామేశభూమి స్పృగగ్రేసరుండనేక నౌకానీత ద్వీపాంతర ప్రశస్తవస్తునిస్తుల శుభలక్షణ సలీలంబగు నిజసౌధాంతరాళంబునం దొక్కదినం బునం జక్కదనంబునగ జయంత వసంతాదులంబోలు సామంత హితమంత్రి కు మారవారంబునుం బురోహితవిద్వత్కవి పౌరాణిక వైణికాదివర్గంబునుం బరివే ష్టింప నిష్టగోష్ఠి వినోదంబునం గొలువుండి యప్పుడు॥

సీ॥ నిత్యసత్యవ్రతస్తుత్యుండౌ నెల్లనార్యునిపౌత్రుహారితసన్ననిసగోత్రు
భారతీపురుషావతార మారంగధామూర్యుని తనయువిఖ్యాతవినయు

సతతపుణ్యాచారయుతగంగమాంబికాగర్భసంభవుఁగళాకలితవిభవు
నల్లమరాజాన్వయజునిసుబ్రహ్మణ్యకవినామధేయుసత్కవివిధేయు
ధామకృష్ణకవీంద్రావరజునిపేర । పురవరసమీపసక్తిచేబ్రోలునాను
సంవసథవాసునుభయభాషాకవిత్వ । విలసితునినన్నురావించిపలికెనిట్లు॥

క॥ అకలంకభారతీకరు । ణకుఁబాత్రమవైనసుధీజనముచేనిలనె
న్నికఁగాంటివిసుబ్రహ్మ । ణ్యకవీంద్రాసాహితీరసాంబుధిచంద్రా॥

సీ॥ ప్రత్యక్షరశ్లేషపద్యాళిమాద్గులకృష్ణభూపతిసభఁగీర్తిఁగంటి
రహిమణిధ్వజచరిత్రమొనర్చియెన్నొలరామనదొరచేతభూమిఁగొంటి
రసవదలంకారవసతిదైచతురిమప్రబలగూర్చితివిభద్రాపరిణయ
మమరంగఁదెనుఁగించితాత్మబోధమునుసారమగుప్రశ్నోత్తరరత్నమాల
శేషధర్మేతిహాసవిశేషమంధ్రి । భాషగనొనర్చియుడతలపాపయసచి
వప్రతిష్ఠితలింగమపర్తిరామ । విభునకర్పించితివిపుణ్యవిభవమెసఁగ॥

వ॥ కావునంజిరకీర్తికరంబగు సంతానసప్తకంబున కవతంసంబైన కృతిసంతానంబు పగిదినగణిత వాంఛిత ఫలప్రదంబగునిది నిక్కంబు చొక్కంబగు నాకుకొబ్బంబు నాకు హరివంశోక్త గోవింద పట్టాభిషేక పూర్వకంబగు రుక్మిణీ వివాహకథనంబునంగూర్పుమనినబహుమానంబుగా తాంబూలాంబరాదులొసంగి వీడుకొల్పిననంగీకరించితేను మదీయధామంబగు చేబ్రోలునామక గ్రామంబున కరిగి వేయునెనిమిది నూరులబ్దంబులు శాలివాహనశకంబునంగడువనడరిన బహుధాన్యవత్సర శ్రావణశుద్ధపంచమీ భృగుదినంబున నతత్కృతికిం బ్రారంభించితి నింకఁదన్నాయక వంశావతారం బభివర్ణించెద॥

మ॥ పొసరించుంజగదుద్భవస్థితిలయంబుల్ పూనియేవేల్పుప్రా
మినుకుంబొల్గులు లేపరేశుమహిమంబెర్గొంటకుంజాలవా
తనియూరూద్భవమైనవర్ణముతులాధారాదిధన్యాత్మసం
జనకంబైనిగమోక్తధర్మశుచితాచారాదులంబొల్పగుణ్॥

గీ॥ అందుజలరాశిసప్తకమందుపాల । వెల్లికైవడిసిరికిఁబుట్టిల్లుగాఁగ
బచ్చువంశంబుదగునందువైశ్యవరుల । నేకులుదయించికాంచిరస్తోకయశము॥

క॥ వారలలోవివిధవ్యవ । హారైకసమర్థుఁడైసమస్తైశ్వర్య
స్ఫూరాదారగుణాద్యుఁడు । పేరయ్యాఖ్యార్యవరుఁడు పెంపొందుధరణ్॥

# శ్రీకృష్ణకల్యాణము.

ఉ॥ సత్యముధర్మముందయయుశాంతియుదానములోనుగాగుణౌ
న్నత్యములెల్లఁదానుజననంబయినప్పడతోడునీడలై
నిత్యసుసంపదాయువులనిస్మలకీర్తులఁబెంపసజ్జన
స్తుత్యుఁడుపేరయాహ్వయుఁడుశోభిలుబచ్చుసువంశరత్నమై॥

క॥ అతనికిరామేశాఖ్యుం । డతులితశుభలక్షణాఢ్యయగుచుంబతిదే
వతయగునక్కాంబికయం । ధతిసంపన్నిధిజనించెననుపమయశుఁడై॥

సీ॥ సత్యభామావిశేషతహరిశ్చంద్రుండు చంద్రుండుసంపూర్ణచారుకళల
ననుపమసంపత్తినగజాప్తమిత్రుండు మిత్రుండువిస్ఫురద్గాత్రకాంతి
లలితరూపాప్తిచేనలసూనధర్ముండు ధర్ముండున్యాయపథప్రవృత్తి
గంభీరభావసంగతిరమాజనకుండు జనకుండువిమలవిజ్ఞానగరిమ
సములగుచరితనికటంచుజగమువొగడ । నెగడెనగణితసుగుణరత్నగణలోహ
ణంబువైశ్యకులాభరణంబుపార్వ । తీశపదభక్తిధనుడురామేశఘనుఁడు॥

క॥ ఆరామేశాఖ్యమహో । దారునకున్వెంకమాంబయందుఁగమలనా
భార్యాధనయుఁడురాజన । పేరయశ్రీరాముఁడనభువింబొశమిరొగిన్॥

గీ॥ క్షమఁగమలనాభుఁడనఁదగుఁగమలనాభుఁ । డలరురాజనరాజనఁగళలభూతిఁ
జెలువపేరయ్యపేరయ్యయులక్షుధర్మ । రతినిశ్రీరాముఁడనఁగశ్రీరాముఁడలరు॥

వ॥ అందు॥

సీ॥ కరివేల్పునెపమునఁగలశపాథోరాశియంకకైతవముననమృతకరుఁడు
పుష్పంధయచ్ఛలంబునసితాంభోజంబుపరభృతచ్ఛలనఁగల్పద్రుమంబు
కర్ణదంభమునవేగంటిచక్కనిజక్కికృష్ణపాదములపేరిటననంతుఁ
దినసుతావ్యాజంబుననువియన్నిమ్నగగళవిషచ్ఛద్మనంగజవిరోధి
గాంచిరయశంబుసకలలోకప్రసిద్ధుఁ । డైనయాపేరయాఖ్యవైశ్యాగ్రగణ్యు
దశదిశాంతరపరిపూర్ణధాళధళ్య । భూరిసత్కీర్తిచేఁబరాభూతులగుచు॥

ఉ॥ సాంబపదాబ్జభక్తుఁడగునాసుకృతాత్మునిరాణిభూరిభా
గ్యంబునఁబద్మపాణిదిరమాక్షమపెంపునక్షోణిభవ్యశీ
లంబునశకురాణిపలిలాలితసూక్తులవాణిసత్సతీ
త్వంబునశర్వరాణిమహివర్తిలుజెగ్గమసాధ్విపోణిమిన్

క॥ ఆదంపతులకువిబుధవ । రాదృతసత్కీర్తిశక్తిహతతారకుఁడై

మేటని రామేశుండా । ర్యాదేవీశులకు స్కందునట్లుదయించెన్॥

శా॥ రామేశప్రతిమాననిర్మలయశోభ్రాజిష్ణుఁడై భారతీ
రామేశప్రతిభాసమానధిషణారమ్యుండునై యిందిరా
రామేశప్రతిమానసత్వగుణధౌరంధర్యసందీప్తుఁడై
రామేశార్యవతంసమొప్పనుజగత్ప్రఖ్యాతభాగ్యోన్నతిన్॥

ఉ॥ ఇంద్రునకున్ సహాయతను పేందుఁడువర్తిలురీతిలోకని
స్తంద్రయశోవిశాలుఁడు బుధస్తుతసూనృతభారతీహరి
శ్చంద్రుఁడు తత్ప్రియానుజుఁడు సౌమ్యుఁడు వేంకటరాయుఁడొప్పధీ
సాంద్రత నగ్రజన్మహితసంతతసత్కరణప్రవీణుఁడై॥

సీ॥ సకలార్థిచాతకప్రకరతృష్ణలు దీరె బాంధవసస్యసంపదలు మీరె
గురుబుధోత్కరసరోంతరములు నిండారెఁ గవిరాకుంతితోత్కంఠలూరె
విద్యాబలాకికావృద్ధి చెన్నలరారె సన్నయయూరములు హెచ్చరికఁ గేరె
భృత్యదారిద్ర్యంపుటెరగళ్ళు చల్లారె నాప్తకేళివనాళులలమ బాఱె
బచ్చువంశాంబునిధియందుఁ బ్రబలియమృత । విమలహృదయాంబుసన్మార్గవిహారణంబు
నెసఁగ నిలఁ జల్లనైన రామేశఘనుని । వితతవితరణధారాళవృష్టి గురియ॥

సీ॥ తమ బాడబప్రభావము ప్రసిద్ధంబుగ నమృతప్రవాహంబులానుచుండ
తమలసద్ద్విజరాజతారూఢివిఖ్యాతిగ నవసూపసమృద్ధి గాంచుచుండ
తమమువిప్రవరభావము ప్రకటంబుగ దివ్యాన్నహారితఁ దేలుచుండ
తమయచలామరత్వము రూఢమైతోఁప గోరసాద్యనుభూతిగొనబుమీర
లక్షసద్బ్రాహ్మణులకు దుర్భిక్షవేళఁ । గోరినటు రేయుఁబగలు నవ్వారిగాఁగఁ
దృష్టిఁ గావించి పుణ్యసమృద్ధిపడసె । వైశ్యమాత్రుండె రామేశవరయశుండు॥

సీ॥ అలయించు నీహారహారహీరశతారతారాగఘనసారసారరుచుల
దహిమించు నహిరాజరాజదభ్రధరాజరాజాశ్వేభసమాజమాజనకుల
గడునెంచు బిసకాండకాండజాసనకాండకాండసుత్రామఖండఖండతతుల
బ్రహసించు బలరామరామప్రభాభూమభూమాన్యహిమధామధామకములఁ
దనకెదురులేక దశదిశాంతములదండి । నిండితండోపతండమై మెండుకొనుచు
నెసఁగు బ్రహ్మాండమొరసి రామేశదాన । శౌండునుద్దండపాండురాఖండయశము॥

సీ॥ దివ్యంబులైన మందిరములు గట్టించి తగురీతి భూసురోత్తముల నిలిపి

యమృతోపమానపయఃపూరితములుగఁ గాకినాడను దటాకములొనర్చి
నందనవనసమానములైన పుష్పఫలాంచితారామంబులలరఁ బెనిచి
యుపనయనంబులనుపనీతులకు వటువులకుఁ బెండ్లిళ్లు పెక్కులొనరించి
యోశరునంజలిపండిళ్లనిడిచనువుల
మిన్నలగు జన్నిగట్టుల కెన్న జన్న
ములను సమకూర్చి సత్కర్మములను మఱియు
జేసుఁ జేయుచునున్నాఁడు సేయఁగలఁడు
సుజనగణ్యుండు రామేశ శుభగుణుండు॥

సీ॥ రహిని రామేశానురాగిణియై సర్వమంగళాకారసందవహించి
చతురాననవిలాసనసహితయై తనరారి మంజువాణీలసన్మహిమ నెసఁగి
యతులలక్షమాఖ్యాతి నలరి మహార్యులు వొగడఁగ వసుమతీస్ఫురణ నమరి
నిరుపమకమలపాణిద్యుతి నిరవొంది ఘనతర శ్రీసమాఖ్యను ధరించి
గౌరికైవడి భారతిగతిని భూమి । లలన చెలువున శ్రీమహాలక్ష్మిలీల
తత్కుటుంబిని పతిభక్తితత్పర శుభ । లక్షణగుణాఢ్యయగు మహాలక్ష్మి వెలయు॥

గీ॥ ఆమహాలక్ష్మియను భార్యయందుఁ గాంచె । సుతుల నిర్వుర రామేశ సుజనవరుఁడు
లలిని నరసింహరామమూర్తులను రాముఁ । డవనిసుతయందు నలకుశలవులఁ బోలె॥

సీ॥ తనవిగ్రహమునఁ జూచు తరుణీమణులకు మన్మథవిగ్రహస్ఫూర్తి మదిజనింప
దనదు మిత్రత్వంబు గనునట్టి జనునకు రాజావతంస మిత్రత్వమొనర
దనగుణంబుల సువర్ణనభూషణమొనర్చు సుకవి సువర్ణభూష్ణుత నెసఁగ
దనసన్నిధానంబు గనునట్టి యాశ్రితోత్తమునకు ధనసన్నిధానమమరఁ
జక్కదనమున మైత్రివిశ్రాణనమున । సజ్జనావనమున నుర్విజనులలోన
నిజసమానులు లేకుండ నెగడుచుండు । నార్యరక్షాకరుఁడు నృసింహార్యవరుఁడు॥

గీ॥ వరగుణాళిమించు వారినిధిస్ఫూర్తి । సకలదిశలనుండు చారుకీర్తి
నలరి చంద్రుఁబోలు నట్టికళాపూర్తిఁ । బ్రబలు రమ్యమూర్తి రామమూర్తి॥

ఉ॥ ఇట్టి సుపుత్రసోదరసుహృజ్జనులున్ సతులందురత్నమై
నట్టికళత్రమున్ బహుజనావనదక్షత నొప్పుకల్మికిన్
బుట్టినయిండ్లుగా శుభసమున్నతి సాధములొప్పఁ గీర్తికిం
బట్టుగ ధర్మమొంది కృతిభర్త ప్రవర్తిలు నెల్లకాలమున్॥

## షష్ఠ్యంతకందములు.

ఏతాదృశగుణధుర్యున । కాతతవాక్చాతురీసురాచార్యునకున్
భూతలహితచర్యునకున్ । ఖ్యాతామితధైర్యమందరాహార్యునకున్॥
శారదవరనీరదహర । పారదశరనారదసురపాదపమిహికా
సారససితసారసఘన । సారసదృశసారకీర్తిసంభారునకున్॥
శాంతనకుసుగుణభరితా । శాంతునకున్ సకలభోగసామ్రాజ్యశచీ
కాంతునకుధర్మనిరత । స్వాంతునకున్ రుచిరరుచివివస్వంతునకున్॥
శ్రితభరణాంచితకరణా । మితకరుణాసాగరునకమేయమహార్య
స్తుతగార్యాద్భుతచర్యా । యతమర్యాదాకరునకునఘువరునకున్
సామంతశిఖామణికిన్ । శ్రీమద్బచ్చుకులవార్ధిశీతలఘృణికిన్
రామేశసమాఖ్యార్య । గ్రామణికింబండితాబ్జగణదినమణికిన్॥

వ॥ అభ్యుదయపరంపరాభివృద్ధిగా నారచింపంబూనిన శ్రీకృష్ణకల్యాణంబనుమహాప్రబంధంబునకుంగథావిధానం బెట్టిదనిన॥

## కథాప్రారంభము.

సీ॥ ఏవీటనడురేయి దేవకీచిత్తాబ్జమలరించె హరివిచిత్రాభ్యుదయము
మననిచ్చె నేవీట మాధవాగమనము సొంపువహించు కుబ్జాకామోదగరిమ
నోనరించెఁ గమలాహితుని తేజు కువలయాపీడావసానమేవీట నొదవి
యినసుతయేవీటఁ గృష్ణానుకూలవిభ్రమఘనవేణియై ప్రమదమొనఁగు
నేపురహిఁ జూపుసిరికది కాపురముగఁ । గాపురాయితలసదలకాపురంబు
గోపురముహుర్ముహుస్స్పృశద్గోపురంబు। ప్రహసితధరాపురమామధురాపురంబు॥

చ॥ తనకులగోత్రసంతతికిఁదావలియైనహరిపాదలీలసోఁ
కనికతనందమొప్పృతముగాఁగడనుంటుకుఁగోసిచుట్టుకొం
డనిగమసాలమైపొడమినవ్యధృతిన్ హరిపాదలీలలోఁ
గొనుచుసువర్ణదీప్తమయికోమలతన్నిరతంబుబొల్చుగున్॥

మ॥ కలసీసూనుఁడుదన్ను వెండియునుగింకంగ్రోలునోయంచు బె
గ్గిలియప్పీటనమేయఖేయమయిడాఁగెన్వార్ధిగాకున్నని

త్సలుతత్సంగతిగంగయేలనిలుచున్ సద్వేదికావాలుగా
కలనాంచత్తటములాప్రవజ్రవిలసద్ఘంటాపథచ్ఛద్మమై॥

ఉ॥ ఆపురగోపురాగ్రిమగుహాంతరదంతురగారుడాశ్మసం
స్థాపితసీమలంజనుపతంగశతాంగతురంగమంబులన్
రాపిడిఁబుట్టుతన్మణిపరాగముగ్రమ్మినవచ్చపచ్చనౌ
రూపులుదాల్పనర్కుఁడలరున్ హరిదశ్వుఁడనంబ్రసిద్ధిచేన్॥

ఉ॥ అచ్చరలందొకొక్కతెయొకప్పుడునెయ్యపుటల్కచే నిలన్
వచ్చినవీటిమేడలపయిందగురత్నపుబొమ్మలందురూ
పచ్చగడాఁగరావెలలనాచలమేటికెయంచుబొమ్మకే
ల్మచ్చికఁబట్టుదేవవిటులంగనినవ్వుదురప్సరాంగనల్॥

సీ॥ గాయనీవల్లకీగానస్రవన్మృగాంకకాన్తాంబునిర్మితాభ్రాపగములు
చతురదంపతిరతిశ్రమహారినందనమందారసౌరభ్యమారుతములు
బాలికాఘటితపాంచాలికాకంఠహారాయితతారాళిజాతములు
సలిలకేళివిలాసవతీపచోవీనఖనదీమరాళికాకలకలములు
నీలమణిజాలనిర్గతనిబిడధూప । ధూమజీమూతదర్శనోత్సుకితపుషిత
కేకికేకాప్రతిస్వనన్నాకలోక । హర్మ్యతతులప్పురీభర్మహర్మ్యతతులు॥

సీ॥ దివ్యకళాస్ఫురద్ద్విజరాజులయ్యనుభవనజాతహితత్వమునువహించి
సతతసుధర్మాధిగతులైనజిష్ణులయ్యుఘబలసంయుక్తిఁబరుచుండి
తగునర్థనిధులనొప్పగుబేరులయ్యునాశాన్వితోగ్రసఖత్వమందకలరి
హరిపదసంభూతులైవరబలభద్రులయ్యుగురుప్రలంబాప్తతఁదగి
సరవినని శాకలంకులైసకలపుణ్య । జనమనోభీష్టకరులైప్రసన్నసుధ్యగు
పేతులైరుక్మిలీలలనెనసియుండు । రందుబుధులునృపులర్యులఁగ్రిభపులు॥

క॥ నగవైరికివెఱచుచుము । న్నగములగములాత్తమదగజాకారములై
నగరమునమెలఁగునిదిబొం । కగునేనవినాగములనునాఖ్యలఁగనునే॥

క॥ ఇనునప్పులకుప్పనుముం । చెనటంచుఁదదశ్వములహసించెడిచందం
బునఘనతరజవనగమన । జనితానీనఫేనములనచటిహరులువగున్॥

క॥ ఆనగరిరథములకుసరి । బూనఁగజేజేలయరదములుగడఁగిస్త్రిరా
న్మానగతిలేమినోడివి । మానములనుసంజ్ఞఁగనెనమానుషభంగిన్॥

క॥ చటులతరశస్త్రవిద్యా । ల్పటువగుపిడుగుకుక్కుతునియలకుఁగూరిచియే
చ్చటవిధినరులుగఁజేసిన। యటులుండురుబలసమగ్రులగువీరభటుల్ ॥

సీ॥ సకలంకములుగానిచంద్రబింబములుపవ్వళైనమోడ్పనికువలయములు
కాఠిన్యమొందనికళుకునీలంబులుమౌర్వ్యఘటనలేనిమరునివిండ్లు
మ్లానిమయెపుడుగల్గనిబంధుజీవముల్ తఱిగనస్తమింపనితారకమ్ము
లనయంబుజోడువీడనిచక్రవాకముల్ మాలిన్యమొదవనిమణిశిలాక
లనఁగనగుమొగములుచెక్కుగనుగవలును
మూఁగురులుసోగబొమలుగెమ్మోవులుమృదు
నఖములునుగబ్బిగుబ్బలందంపుమేను
లలరనప్పురిజవరాండ్రువెలయుచుండ్రు॥

సీ॥ మేలిమిరతనాలకీలుబొమ్మలకెట్లుగలిగెనోముద్దుపల్కులహొరంగు
లతనుసమ్మోహనాస్త్రాధిదేవతలకెవ్విధినబ్బెనోసాంగవిలసనములు
గరువంపుదెలుగంటిక్రాల్గంటులకునెట్లులరెనోనిమిషచంచలదృగంశు
లిలఁగ్రొమ్మెఱుంగుదీవలకెతెఱంగునఁబ్రబలెనోవిరరుచిరత్వలీల
లనుచుసరసులుసందియంబందితెలసి । వలసికలసినరతులమెప్పలనుగాంతు
రందుసంగీతనృత్యవైయాత్యనిరతు । లౌరశృంగారవసతులువారసతులు॥

ఉ॥ కాముఁడుతత్పురీకబహులకాముకరూపములంజరింపఁద
ద్భామినియుంబహుత్వమును దాలిచియాతనికైతదీయసం
గ్రామసహాయతక్షరశరపరంపరలిచ్చుననన్విటాళికిం
దామరసాదులైనవిరితండములిత్తురుపువ్వులాడికల్ ॥

సీ॥ సారశృంగారభూజారామసుమనోమహామోదసంగ్రహవ్యాప్తినెసఁగి
యమితరసాపూరితాంతరంగగభీరభవ్యపద్మిమలవిభ్రమములెనసి
దేవవల్లభసముద్దీపితసురసాలముఖ్యద్రుసుమఫలంబులఁజెలంగి
వితతభోగాసక్తవివిధబంధజ్ఞభుజంగపుంగవసంగతింగరంగి
వాతపోతగతిద్రాలువాతపోత । ములొగిసరసులరీతివర్తిలుసరసులు
నందనంబులక్రియనొప్పునందనములు । భోగినులభంగిభోగినుల్బొల్తురచట॥

మ॥ లలినేతాదృశదివ్యసంపదలకెల్లంబుట్టినిల్లైధరం
జెలువానమ్మనుశాపురంబునకుజేజేప్రోలికిన్వోయుగ

న్నులవేల్పుంబలెనుగ్రసేననృపమాన్యున్ భూరితేజస్సము
జ్జ్వలుమాతామహుఁ రాజుఁజేసెఁగరుణాసాంద్రుండు కృష్ణుండొగిన్ ॥

ఉ॥ ఆనరనాయకుండు హరియానతి రాజ్యభరంబుఁ బూనిధ
ర్మానుగతిన్ సునీతిగరిమన్నిరతంబు నిరీతిగాఁగడున్
మానితసౌఖ్యవైభవసమగ్రముగాఁ బ్రజనేలుచుండఁదన
చ్చోనాకనాథుహేమమణిశోభితమై పొలుపొందు మోసలన్ ॥

సీ॥ గర్గాదిమౌనీంద్రవర్గంబు లొకవంక నొకవంక గురుయాదవకులనృపులు
నలగదాక్రూరముఖ్యానుజు లొకచక్కి నొకచక్కి సుహృదమాత్యులచయంబు
బలరామసాత్యకిప్రముఖాప్తు లొకచెంత నొకచెంత నిజభక్తసుకవివరులు
గాయకవందిమాగధవర్యు లొకయోర నొకయోర నృత్యకృద్యువతితతులు
గొమరమరవారి నడుమ రత్నమయపీఠి । యందు శ్రీకృష్ణుఁ డమరబృందాంతరమున
దలఁపురతనంపుగద్దియ నలసురేంద్రు । నట్లు నిండోలగంబుండు నవసరమున ॥

గీ॥ అఖిలజనులవార్తలాలించియుండ దండ । జనపదములగుప్తిసంచరించి
సత్ప్రిచారులయిన చారులు గొందఱు । వచ్చి శౌరికెఱిగి పలికిరిట్లు ॥

క॥ చన్నారమెల్లకడలకుఁ । గన్నారము సైన్యయుతముగాఁ జనునృపులన్
విన్నారమఖిలవార్తలు । మన్నారము నీదయాసమగ్రత శౌరీ ॥

ఉ॥ విన్నపమాలకింపు యదువీరలలామ విదర్భరాజ్యసం
పన్నుఁడు భీష్మకుండ నృపాలకుఁడాతని పుత్రులేపుర
త్యనతరూపవిక్రమసముజ్వలమూర్తులు రుక్మిముఖ్యుల
య్యన్నలముద్దుచెల్లెలలరారును రుక్మిణినాఁ బ్రసిద్ధయై ।

ఉ॥ ఇన్నరరాజకన్యలు సురేశ్వరచారణయక్షబాలికల్
కిన్నరరాజకన్యకలు ఖేచరరాజకుమారికామణుల్
పన్నగరాజకన్యకలు భాసురసిద్ధతనూజలైన న
క్కన్నెకొకింతయైన సరిగారట రూపకలాపసంపదన్ ॥

మ॥ త్రిజగన్మోహనమంగళాంగలతికా శ్రీధన్య కా కన్యక
గ్రజముఖ్యుండగు రుక్మిసమ్మతి నెసంగం దండ్రియౌ భీష్మకా
ఖ్యజనేశుండు స్వయంవరోత్సవము సేయంబూనన న్నాథుభృ
త్యజనంబుత్సవమెల్లి కుండినమునందౌనంచుఁ జాటించినన్ ॥

మ॥ వినియా రాకొమరిన్ స్వయంవరమున న్వైగైకొనంగోరిమిం
చిన వేడ్కాల్ చిగురొత్త మత్తగజవాజిస్యందనాందోళికా
ద్యనవద్యప్రథమానయానములతో నాత్మీయసేనాళితో
జనఁగాఁగంటిమి రాకుమారులరణేచ్ఛాధారులన్ శూరులన్॥

గీ॥ మఱియుఁగాశ్మీరనేపాళమగధసింధు । ముఖ్యదేశాధినాథులమోఘబలులు
సింహశార్దూలవిక్రముల్ సేనలోలయ । నరిగిరిస్వయంవరజయార్థమనికిఁబోలె॥

చ॥ అనియిటుగూఢచారుఖరయంబునఁజక్రికివిన్నవింపన
వ్వనరుహనేత్రుఁడుల్లమునభల్లముడాఁకగతిందదుక్తి నా
టినవడి నేఁగగాఁదగుఁగడిందిమగంటుమినిందఁగుండినం
బునకనుచున్ హితాప్తయసుముఖ్యులతో నపుడుద్యతాత్ముఁడై॥

గీ॥ రాజకార్యప్రవీణులై ప్రబలుమంత్రి । వరులఁదత్తత్ప్రయోజనపరతనిలిపి
రణసముత్సాహయోధవర్గచతురంగ । బలముయాదవవీరులఁబన్నఁబనిచి॥

ఉ॥ హారకిరీటకుండలయుగాంగదకంకణకింకిణీప్రకాం
చీరమణీయరత్నరుచిజృంభణముల్ దిశలెల్లఁగప్పనో
ప్పారుపసిండిచేలమెఱయన్దరచక్రగదాసిశార్ఙ్గశో
భారుచిరాంగుఁడైనపవిభావసుభంగివెలింగెనయ్యెడన్

మ॥ తనచెంతన్మణికాంతపీఠముననధ్యాసీనుఁడౌనుగ్రసే
ననివీక్షించివచించెనీక్రియముకుందుండిందుమాయన్నతో
డనునీవుండుముకుండినంబునను వేడ్కాల్ మీరస్వారాజ్యమం
దునిలింపావళివోలెనుండిరనరేంద్రుల్మాగధుండాదిగాన్॥

క॥ కావుననేనటుకుఁజనం । గావలయుననుజ్ఞనొసఁగఁగాఁదగుననగా
భూవల్లభుండుఘనచిం । తావిలచేతస్కుఁడగుచుహరికిట్లనియెన్॥

చ॥ చెలిమినిగాదెక్రొత్తలువచించెదవోయదువంశనాథనీ
యలఘుభుజాబలాశ్రితులమామముబోటులమీవులేవిచో
జెలువుఁడవులేనియింతులటునింతిలుచుందుమునీవుచెంగటన్
వెలసిననింద్రుతోడఁదగువేల్పులరీతిసుఖింతుమెంతయున్॥

గీ॥ కానవిజయార్థమెక్కడెక్కడికిఁజనుదు
వచ్చటికినమ్మఁదోడ్కొనియరుగవలయు

ననుడునత్త్రాతనుడుపులనాలకించి
కించిదుద్గతహాసుఁడైకృష్ణుఁడనియె॥

క॥ ఇప్పటికిటచనయుండుము । డెప్పుడునింకమీద నేచటికేఁగినమిమ్ముం
దప్పకతోడ్కొనిచనియెద । నప్పట్టునకననతండుహర్షించెఁదగన్॥

క॥ జననీజనకులకునుషం । ధనములుగావించిదీవనలతోఁదదను
జ్ఞనువడసిదారకునిఁదాఁ । గనుఁగొనిరథముద్యతంబుగావింపుమనన్॥

సీ॥ లోలకరికరణినిస్తులబలాహక మేఘపుష్పాదిశోభాప్రపూర్ణమగుచు
నుపరాగముంబోలె నూర్జితద్విజరాజకలితోన్నతధ్వజలలితమగుచు
మధ్యందినముభంగి మానితానంతరత్నప్రభావృత దిశాదశకమగుచు
ప్రత్యూషము తెఱంగు బంధురతరచక్రసంఘసంఘటన ప్రశస్తమగుచు
కనకమణిమయ కలశశృంగ ప్రదీప్త । మగుచు నలమేరుగిరితీరు నలరఁగేరు
చారుతారూఢిమీరు బంగారుతేరు । దారకుఁడు దే నధిగమించెఁ దానిశౌరి॥

వ॥ ఇట్లు శ్రీకృష్ణుండు దివ్యరథాధిరూఢుండై హేమాంబరాభరణమణి ఘృణీనారం
బు నీరెండ చెలువున వెలుఁగఁ దొలుగొండ నెత్తంబు హత్తిన క్రొత్తవెత్తమ్మి విం
దు పొందికం జెంద మిన్నంది వంది మాగధకైవారంబులు నభంగమంగళ మృదం
గపటహ ఢమామికా కాహళాద్య వాద్యతూర్య ఘోషంబులు బిట్టులియఁ గట్టె
దుర సుందరీరత్నంబులు దెచ్చు కుచకుంభ తులితశాత కుంభ పూర్ణకుంభాది శు
భనిమిత్తంబుల కలరుచు సౌధవీధికాగ్రస్థిత నతీహస్తవిన్యస్త సిద్ధార్థ లాజంబుల
నందుచుం బురంబు వెడలి చతురంగబల సమేతంబుగా నుద్ధవ గదాక్రూర ప్ర
ముఖ యాదవ వీరవర్గంబు తమతమరథంబుల నధిష్ఠించి పిరుందనరుదేరం గతిప
య ప్రయాణంబులం జనిచని విదర్భవిషయంబుసొచ్చి భూమానినీమండన నీకాశం
బగు కుండినపురప్రదేశంబు సేరవచ్చెననిన వైశంపాయను నవ్వలికథ నెఱింగింపు
మని జనమేజయుండడుగుటయు॥

ఉ॥ మందరధీరధీరజనమానితపుణ్యవిహారహారపూ
ర్ణేందుశతారతారభుజగేంద్రమృగేంద్రనగేంద్రపద్మభూ
నందనచందనప్రతిమనవ్యయశోఘనభారభారతీ
సుందరనూపురారవవచోనిచయామృతసారసాహిణీ॥

క॥ భావభవరూపవైభవ । భూవిబుధసమాజకల్పభూజసుహృద్రా

జీవనజాతవనీరా । జీవహితాసతతధర్మచింతనసహితా॥

మాలినీవృత్తము॥ విదితవినయవిద్యావిశ్వవిఖ్యాతపద్యా
చతురమతివిధాతా సత్యవాగ్ధర్మజాతా
శ్రితగుణమణిభారా జెగ్గమాంబాకుమారా
ప్రతిమరహితపుణ్యాబద్ధవంశ్యాగ్రగణ్యా॥

గద్యము॥ ఇది శ్రీమహాభారతీ ప్రసాదాసాదిత కవితామ తల్లికాల్లమ
రాజాన్వయ మాలికా రత్న రామద్రావిడ ముఖ్య హారితస
గోత్ర పవిత్ర రంగధామార్య పుత్ర సుకవి జనవిధేయ
సుబ్రహ్మణ్యకవి నామధేయ ప్రణీతంబయిన
శ్రీకృష్ణ కళ్యాణంబను మహాప్రబంధం
బునందుఁ బ్రథమాశ్వాసము॥
శ్రీ. శ్రీ. శ్రీ.

---

శుభమస్తు.

# శ్రీ కృష్ణ కళ్యాణము.

## ద్వితీయాశ్వాసము.

క॥ శ్రీలక్ష్మీగౌరీరమ । ణాలోలదభేదభావనారూఢమనో
నాళీకవరకళాంచ । చ్ఛైలనరామేశ నామధేయార్యమణీ॥

వ॥ అవధరింపుము॥

క॥ ఘనుఁడగు వైశంపాయన । మునిజనమేజయనృపాలముఖ్యున కెఱిఁగిం

చినరీతి శౌనకాదులఁ । గనుఁగొని సూతుఁడిటు చెప్పఁగా దొడఁగెనాగిన్॥

సీ॥ అట్లు శ్రీకృష్ణుఁ డత్యనుపమ శ్రీవిభాసురమైన కుండినపురముపొంత
నరుగుచు నుపవనాభ్యంతరసీమల సాళ్వపౌండ్రకజరాసంధముఖ్య
సకలదేశాగతక్ష్మాపాలసైనికస్థితసితపటకుటీరతతిచేతఁ
దత్తచ్చమూసమూహోత్తుంగమత్తమాతంగతురంగశతాంగసుభట
పటలిచే నిండియుండు నుపాంతములను । గనుఁగొనుచు మెల్ల మెల్లనఁ జనుచు వెనుకఁ
జిక్కు నిజపరివారంబు సేరుదనుక । నిలువ హరి రాక భీష్మకనృపుఁ డెఱింగి॥

ఉ॥ ఎదురుగ వచ్చి తోడుకొని యేఁగఁ దొడంగిన నంతరుక్మియున్
మొదలగు వారలాతని సముద్యత మెల్లను మాన్పమానెన
య్యదువిభుఁ డయ్యెదంతము సమస్త మెఱింగి రజోగుణాత్ముఁడై
మదిఁదలఁచెన్ మహాబలసమంచితకాయుని వైనతేయునిన్॥

క॥ కులబలరాజ్యప్రభుతా । దులగర్వితులైన భూపతుల కెల్ల భయం
బొలయుటకున్ స్వమహిమమున్ । వెలయించుటకట్లు వృష్ణివిభుఁడు దలఁచిన్॥

సీ॥ తెలిదీవియఁ సటితళుక్కులమించుతుండాభ దెలుపెక్కుమునుమున్నదీదిచక్కి
లాక్షారసార్ద్రనీలవితానమనఁగ లేఁదొగరెక్కగయులఁ గ్రొంజిగినభంబు
కడుపాలకడలిలోఁగదలమీఁగడలఁ జిడ్డెఱిఁగించి వీచెపెన్నెఱకగాడ్పు
పాదద్వయాకృష్టపాండుకుండలివర్యభూత్కారములు మింటిమ్రోతనెనసి
నంతఁగ వనవ్యోమాంతరిక్షాంతరమున । దంతురితపక్షసంచరద్ధాతుమదగ
వరమొఱయనసౌవర్ణవర్ణపర్ణ । భూరిరుచిధారిమణిహారి భుజగవైరి॥

మహాస్రగ్ధర॥ కలయన్నక్షత్రతారాగ్రహములు వడ కెంగప్పఁ బెంధూళి దిక్సం
ధులగాఢధ్వాంతరీతిం దొలిదివి కెగసెన్ ధూతభూజాతజాతుల్
కులభూభృద్గహ్వరాళీ గుభగుభనినదాఘూర్ణితారణ్యసద్వా
కులసానూపత్యకంబై గురుఁగరుడగరుద్ఘోరఝుంపాళి పీవన్॥

సీ॥ జెగడియు వ్వెత్తుగా నెగయు కొంగలభంగి పటకుటీరములూడి బ్రయలుఁ బ్రాఁక
హరిదిభంబుల చెల్మికరిగెడు తెఱఁగున గజములు దూలినల్లడలఁ బఱువ
పెళపెళధ్వనుల భ్రమాకులశాఖలట్లు ధ్వజంబులు విరిగి రథంబులొరుగ
సాదులు జారనచ్చపుపక్కెరలజక్కిగములు దూఱిఁగలకరణి నెగయ
నచటి హరిబలములు దక్కనఖిలనృపులు । భటులపుడు బొమ్మలాడించినటుల వెదరి

సుడివడిచలింపనిలకుఁదార్క్ష్యుండుడిగ్గి। నిలిచెహరిమ్రోలఁగాంచనాచలములీల॥

మ॥ గరుడున్సన్మలనభక్తినమ్రతలునిక్కన్మ్రొక్కువానిన్నిజా
పరదేహంబననొప్పువానిదనుజప్రాణైకహృద్భీకరుం
దురగంబున్ధ్వజమైనవానిధృతిమంతున్శ్రీగరుత్మంతునా
హరిహర్షంబునఁజూచిపల్కెనెఱుకల్హస్తంబునందువ్వుచున్॥

మ॥ అమరేంద్రస్మయాభంగకృత్ప్రౌఢబలబాహావిక్రమాపత్రిస
త్తమనీకుంగుశలంబెసేమమెసమస్తంబున్సితద్వీపవా
సమునందిచ్చటికిన్స్వయంవరమునిచ్చంజూడఁగావచ్చియుం
టిమిమేమీనరపాలపుంగవులఁగంటేసైన్యసంపూర్ణులన్॥

గీ॥ అనుచుగరుడనితోడనెయ్యమునశౌరి। పలుకుచుండఁగనంతలోపలనభీష్మ
కునిపితృవ్యాత్మజుఁడుకైశికుండువచ్చి।హరినిఁగనిమ్రొక్కియర్ఘ్యపాద్యాదులొసఁగి

ఉ॥ ఆదరగౌరవంబునసహర్షనయాంచితభక్తిఁబూజల
నున్మదమునొందఁజేసిస్వసమున్నతమందిరసౌధపాళిక
య్యాదవసార్వభౌమునిఁదదన్వయయోధులుగొల్వఁగాద్రవే
యాదనుతోడఁదోడ్కొనిరయంబుననేఁగెఁబురంబుమెచ్చఁగాన్॥

ఉ॥ అంతదినాంతమొప్పెఁజరమాచలరాజశిరఃకిరీటభా
స్వంతముకోష్ణతాకలితభాస్కరకాంతమయోగజవ్యథా
త్యంతహృదంతరాకులరథాంగశకుంతమలంకృతాత్మగే
హాంతరపుష్పతల్పలలితాంగలతాంచితపౌరకాంతమై॥

క॥ తనుగూడఁగవసువులుగొని। యనురాగమునెరపిపశ్చిమాశావారాం
గనరాజురాఁదెలసిక్ర। న్ననని లువెడలించిపుచ్చెనారవిగ్రుంకెన్॥

క॥ మునుమాపగుటయుఁగైశిక। జనవరనిర్దిష్టదివ్యసౌధంబునన
వ్వనజాక్షుఁడుండెనిజపరి। జనములతోరజతగిరినిశంకరుపగిదిన్॥

గీ॥ శౌరియారీతినారేయిచటవసించి। కైశికనృపాలుచేసినతిగౌరవముగ
నర్చితుండయియిష్టమృష్టాన్నకలన। హితజనముతోడసంతుష్టినెనయుచుండె॥

సీ॥ అప్పుడుగరుడసమన్వితుండయికృష్ణుఁడరుగుదెంచుటఁగాంచియఖిలనృపులు
చింతాద్భుతాకులస్వాంతులైకూడికాంచనమయంబయినభీష్మకునిసభకు
జనుదెంచిమణిమయాసనములఁగనకచిత్రాస్తరణములసింహాసనముల

నమరులువోలెసుఖాసీనులయిమంత్రమునకుఁజొచ్చిరినయస్ఫురణవెలయ
వారిలోనతిభుజబలావార్యశౌర్య । ధైర్యగాంభీర్యచాతుర్యధుర్యతావ
శేణ్యుఁడైనజరాసంధనృపతిగణ్యుఁ । డాత్మపక్షానుచరులతోననియెనిట్లు॥

మ॥ యదువంశోద్భవయోధయూధసహితుండైకన్యకావాప్తికై
యదుసింహుండుగడంగెమన్మనకుసేయంగల్గుకర్జంబిఁకె
య్యదియోదానిబలాబలంబులతెఱంగాత్మన్వితర్కించిని
ఇదలిర్పన్వడినిశ్చయింపుఁడుధరిత్రీనాయకాగ్రేసరుల్॥

వ॥ మఱియునిప్పుడు యదువృష్ణిభోజాంధక మహారథసనాథుండై యుధ్యమానుండగు వసుదేవ సూనుండు గరుత్మంతునధిష్ఠించి కన్యార్థంబుగాఁ గడంగిన సంగరంబున భంగంబులేక లేఖానీకంబుతో నాఖండలుండేని నిలువంగలండే యీయాదివిష్ణుఁడు దొల్లి మహాఘోర విలయంబునం జగంబేకార్ణవంబయిన సమయంబునఁ బాతాళతల నిమగ్నంబగుచున్న భూతలంబు దంష్ట్రాగ్ర లగ్నంబుగావించి వారాహరూపంబున నుద్ధరించి పిదప హిరణ్యాక్షు దైత్యాధ్యక్షు సంక్షయం బొనరించె? నవక్ర బలపరాక్రమధుర్యుండునుఁ త్రిభువనస్థిత మనుజదనుజామరాద్యవధ్యుండును నభేద్యవర ప్రభావ సాంద్రుండగు హిరణ్యకశిపు దైత్యేంద్రుని నరమృగేంద్ర రూపంబుధరించి సంహరించెఁ? గశ్యపువలన నదితిగర్భంబున వామనుండై బొడమి యాసురాగ్రేసరుండైన బలిని వాతాశన పాశబద్ధుంజేసి యాశీవిషావాసంబునవైచె? సహస్రభుజ సమగ్ర విగ్రహావార్యవీర్యుండగు కార్తవీర్యుండు దత్తాత్రేయ వరప్రాప్త సప్తద్వీప భూపత్వంబున మత్తుండైన నపుడు జమదగ్నివలన రేణుకాదేవికుదయించి రాముఁడనం బ్రబలి వజ్రకఠోరంబగు కుఠారంబున నతనిగర్వంబడంచె? నిక్ష్వాకుకులంబున దశరథాత్మజుఁడై త్రిలోక విజయధురంధరుండగు దశకంధరుందునిమె? మఱియుంగాలనేమిప్రముఖామేయ దైతేయుల సంప్రాప్తవర గర్వితులయిన వారింబరిమార్చె. బలభద్ర నామంబునం బరగి ప్రలంబారిష్ట ధేనుకాసురుల వధించె నితండు బాల్యంబునం బకకేశియమళార్జునాజగర కువలయాపీడ చాణూర ముష్టిక కంసాదులంగూల్చి గోప వేషంబునం గ్రీడించుచున్న జగత్కారణ కారణుం డాదిమధ్యాంత రహితుండును నగు నాదినారాయణుండని తలంచెద నాహరికింగాక నరునకుం గరుడుండు వాహనంబగునే యుర్విస్థలంబు దలంచిన వెద్దికాఁడుండు నిద్ధరయెల్లఁ బరికించి మీద సేయంద

గినది నిశ్చయింపుఁడనుటయు నాజరాసంధు వచనంబులు విని సునీథుం డిట్లనియె॥

ఉ॥ అంతయు మాగధోక్తి నిజమౌ ననుజుండీ బలకృష్ణులప్పు గో
మంతమునందు సంగరమమానుష దారుణభంగిఁ జేసి దు
ర్దాంత భటాశ్వ సింధుర రథచ్ఛటఁ గాలహలచక్రవహ్నిచే
నెంతయు నగ్గొనర్చి రిపు డెట్లగునో తలపోయుఁడీ నృపుల్॥

శా॥ కానం గృష్ణునితో నెదుర్ప సకలక్ష్మానాథ సేనాత్తయం
చౌనిక్రంబది యట్టులుండె గరుడం డాశౌరితోఁ గూడి క
య్యానందోద్వృడఁ బక్షవాత హతినయ్యంభోనిధుల్ శైలము
ల్గానల్మంటఁ జలింప నెవ్వఁడపు డింకన్నిల్చువాఁ డిందులన్॥

గీ॥ రాజులకునెల్ల హాస్యవర్ధనము ధనిస్వ । యంవరమహోత్సవంబందు రట్లగాక
యతిభయంకరమును దుస్సహంబునైన । కష్టదంబయ్యె దున్నృపాగ్రణుల కెల్ల॥

వ॥ అనిన సునీథావనీథుని పలుకులు విని కరూశదేశాధీశుండగు దంతవక్త్రుం డిట్లనియె॥

క॥ మగధ సునీథ నృపాలక । నిగదిత భాషణము లతివినీతంబులు తె
స్పగనీతిశాస్త్రగాథా । ర్థగతిన్ నృపసభను బలుకఁదర మెరికగున్॥

క॥ ఈనామొదలగు సకలమ । హీనాయకులెట్లు వచ్చిరిచటికిఁ గృష్ణుం
డానియతి గన్యకార్థము । గానరుదెంచెనది కొదువగానెంచుదురే॥

సీ॥ మున్ను బృందావనంబునఁ బిన్నతైయున్నతఱి వధియింపఁ గృత్రిమము దలఁచి
మధురకు రావించి భీమమత్తగజంబు ద్రొక్కింపఁబంపినఁ ద్రుంచివైచి
చాణూర ముష్టిక సంహరణంబుతో నతనిని బలిమార్చి రతులబలుని
గోమంతగిరిమీద ఘోరయుద్ధమానల్పి చుట్టుకొన్నదవాగ్నిఁ జొచ్చి దాఁటి
రక్షిబలరామకృష్ణులయలఘుమహిమ । దెలుపనలవియెఁ గంసువధింపఁ బుడమి
వ్రేగుడింపఁగఁ బొడమినవిష్ణుఁ డితఁడు । నరుఁడనితలంపకుండు భూనాథులార॥

చ॥ హరి నరమాత్రుఁ గాఁ దలఁచి యాజికి నైజతనంబొనర్చు భూ
వరులు వివేకవంతులనవచ్చునె సర్వశరణ్యుఁడైన య
ప్పరముని పట్టునం బగయు బాలిశబుద్ధియు మత్సరంబు నె
వ్వరికినిఁ గూడదవ్విభుఁడు వంద్యుఁడు మానవదేవకోటికిన్॥

ఉ॥ కావున దేవదేవుని జగత్త్రయకారణుఁ గృష్ణునిన్ సప
ర్యావిధి నర్ఘ్యపాద్యముల నాచమనాదులఁ బ్రీతుఁ జేసి యా

తాఁపసవత్సలుఁడగు నాతనిసన్నిధి నాశ్రయించి ధా
త్రీవరులార నిర్భయమతిన్ సుఖియింతమురండు నిచ్చలున్॥

వ॥ అనిన దంతవక్త్రుని భాషణంబులాకర్ణించి సముచితధైర్యవిశాలుండగు సాళ్వన
రపాలుండిట్లనియె॥

మ॥ చనునే కృష్ణభయప్రకంపితులమై శస్త్రాదులన్వీడి యా
తనితో సంధికి వేఁగుటల్ మనకు శుద్ధక్షత్రవంశంబునన్
జననంబందియు నాత్మబాహుబలమున్ శౌర్యంబుఁగోల్పుచ్చి భీ
తినొందుంగూడుట రాజధర్మమగునే ధీరుల్వినన్మెత్తురే॥

మ॥ ఇవిభూపాలురకర్హమైనపనిగాదెట్లన్న మున్నేనెఱుం
గుదు భూభారముమాన్పఁగంసనృపతింగూల్పన్ భువింగృష్ణుఁడై
యదువంశంబున సర్వలోకవిభుఁడా నయ్యాదినారాయణుం
డుదితుండౌటయు నాజిలో నతనిచే నుర్వీభుజుల్ మ్రందుటల్॥

ఉ॥ మేలుమఁగీడు సేయఁదరమే పరమేశునకేని యెమ్మెయిం
గాలముగూడకున్న నటుగాన రణోద్యమచింతనంబులిం
కేలయొనర్పఁగన్యకయి కృష్ణుఁడువచ్చెనుగాక యన్యులో
నాలమొనర్పఁగా దెవనినచ్చెలిగోరును వానిదేయగున్॥

సీ॥ అని జరాసంధాదులాలోచనలు సేయ నన్నియువిని భీష్మకావనిపతి
మదినిట్లు చింతించె మత్పుత్రకుఁడు రుక్మి దుర్వారబలగర్వ దుర్వహుండు
రణవిశంకటమహారథుఁడతిదర్పుఁడై యెప్పుడుం గృష్ణుపెంపోర్వకుండు
శౌరితో ద్వేషించి సంగ్రామమొనరించెనేనిఁ దచ్ఛరవహ్నినెట్లుబ్రతుకు
వీనిఁగూడి కయ్యమేనెట్టులొనరింతు । దురభిమానబుద్ధి దొడరియకట
యఖిలభువనభర్తయాదినారాయణుం । డచ్యుతుండు నైనయతనితోడ॥

సీ॥ కరవీరపురము నిష్కంటకంబుగఁజేసెఁ గాలకరాళుస్సృగాలుఁదునిమి
గొడుగుగానొక్కకేల గోవర్ధనంబెత్తి గోగోపకులశిలల్ గురియఁగాచె
పంచజనుంద్రుంచి పరలోకగతుల సాందీపునిసుతులను దెచ్చియిచ్చె
యమునాహ్రదంబులో నత్యుగ్రవిషవహ్నివదనుఁడౌ కాళియు మదమడంచె
నురుతరోద్ధతుఁ గేశిదైత్యునివధించె । మున్నితండు సురాసురముఖ్యులైనఁ
జేయనిదురంబు గోమంతశిఖరిఁ జేసె । నదిదలంచిన నిపుడు దేహంబువడఁకు॥

గీ॥ అనుచుఁ జింతించి భీష్మకావనివిభుండు। కృష్ణునిఁ బ్రసన్నునిఁగఁ జేయ నేఁగఁదలఁచె
నట్లు మంతనములు సల్పి యఖిలనృపులు । వెడలి శయనించి రయ్యెడ విడుదులందు॥

సీ॥ అడుగువాల్పిట్టలు యలబలంబులుమీఱె మలయమారుతములఁ జలువలూరె
కలువచుట్టముగ్రుంకు మలనెత్తముం జేరెఁ దారకాగణముల తళుకుజారె
నంగనాప్రియుల నెయ్యంపుటల్కలు దీరెఁ దమ మెల్ల మెల్లన దరులదూరె
తొలుచక్కినాకవింత తెలివిచెన్నలరారెఁ జక్రవాకములు హొవ్వరికగేరె
దీపములు వెలవెలబారెఁ దెఱవునడుచు। ప్రజబయలు దేరె వడిఁ జకోరములు దారెఁ
దమ్మికలలరారెఁ దుమ్మెదబృందములుగూరె । దినకరద్యుతి బొలుపారెఁ దెల్లవారె॥

వ॥ ఇట్లు రేపకడయగుటయు సూతమాగధవంది వైతాళికస్తుతి మంగళగీతంబుల మేల్కాంచి సకలదేశాగత మహీపతులునుఁ గాలోచిత కృత్యంబులు నిర్వర్తించి తమతమ విశ్రామధామంబుల నున్న సమయంబున శ్రీకృష్ణాభిషేకంబు గాఁగలదని దేవదూతలు దమభటులట్లు వచ్చి యెఱింగించిన నందఱుం దెలిసికొని కొందఱు సహింపక దప్పితులయ్యెం గొందఱు దీనతం బారసియుం గొందఱు భీతులయ్యెను నట్టి రాజసమాజంబు త్రివిధంబై మహార్ణవంబు కరణి ఘూర్ణిల్లుచు భేదంబు నొందిచలింప దానినవలోకించి సంచింతిత స్వాంతుండగుచు భీష్మక మహీకాంతుండన్నర దేవసముదయంబుం బ్రతిబోధింపనరిగె నప్పుడింద్రదూతలు కైశికనృపాంతికంబునం బ్రవేశించి రంత నతండు నిజాంతర్గతంబున॥

ఉ॥ హరిగరుడాన్వితుండయి మదాయతసౌధమున న్వసించుటల్
గరమరుదయ్యె నీభువనకారణ కారణుఁ డీసురేశ్వరే
శ్వరుఁ డరుదెంచుటం గలుషవర్జనమై పరిశుద్ధచిత్తతం
బారయఁగఁగంటి నప్పరమపూరుషు మంగళసంగతాంగునిన్॥

గీ॥ ముజ్జగంబులందు సజ్జనజాతులి । కన్నపాత్రమింకొకండు గలఁడె
యతని కెద్దియిడుదు మాతిథ్యముగ నంచుఁ । దమ్ముఁ డైన గ్రథుఁడు దానుఁ గూడి॥

క॥ మంతనముఁ దమరాజ్యం । బంతయుఁ గృష్ణునకు భక్తి నర్పించుటకై
స్వాంతముల నిశ్చయించిత । దంతికమున కరిగి రిరువు రాప్తజనముతోన్॥

వ॥ అట్లు గ్రథ కైశికులింద్రప్రేషిత దూతాన్వితులై తన్మందిరంబున॥

మ॥ చని శ్రీకృష్ణుని గాంచి తన్మృదుపదాబ్జద్వంద్వమం దాత్మకాం
చనకోటీరమణుల్వెలుంగఁగ నమస్కారంబులన్ సల్పి యు

ట్లనిరస్తదృగ్ధహాజన్మకీర్తిబలరాజ్యైశ్వర్యము ల్లోనుగా
దనరారెన్ సఫలంబులై యదుకులేంద్రా నేడు నీరాకచేన్॥

ఉ॥ బంధురహాస్యులెరి నరపాలకులందఱు వైరియాజరా
సంధుఁడుదక్క గా నతఁడు శౌరికిగద్దియలేదు రాజ్యధౌ
రంధరిఁబూనఁడెట్లు తగు రాజులతో గణుతింపనంచు గ
ర్వాంధకనాత్మపక్షచరులౌ నృపులంగని పల్కనిచ్చలున్॥

సీ॥ ఆజరాసంధాదులగు నెల్లనృపులకు శాసనపత్రికల్ వ్రాసవుండు
భటులచేనంపునో పద్మాక్ష మద్రాజ్యమాతిథ్యముగ మీకు నర్పితంబు
జేసితిఁ గైకొనుండి సమస్తనృపాలురులతోడ విదర్భపురమునందు
నింద్రశాసనమునని పుడు పట్టాభిషేకంబొనర్చెదము శృంగారరంగ
మందు సింహాసనంబు మాయన్నయునిచె। నిందునివసింపుమనినచో నింద్రదూత
ప్రావృఢభ్రధ్వనిసమాన భాషణములఁ। గైశికునికిట్లనియె మింటగన్పాఱంగి॥

శా॥ మీసింహాసనమాజగద్విభునకుం బట్టంగనర్హంబుగా
నాసారేంద్రుఁడు విశ్వకర్మరచితంబౌ దివ్యరత్నాంచితం
బీసింహాసనమంపె నిందునిచి శ్రీకృష్ణుకౌహారికిన్ సర్వథా
శ్రీసంపత్పరిషిక్తుఁ జేయుఁడఖిలోర్వీపాళితోఁ గైశికా॥

క॥ కొండినమునకరుదెంచిన। మండలపతులందు నెవఁడు మదబుద్ధిని రా
కుండు నభిషేకమునకు। తండగువంధ్యుఁడ హరికిధరణిపులారా॥

శా॥ యుష్మద్వ్యక్తునియింటఁ బెన్నిధుల ముఖ్యాంశంబులంబుట్టివి
వ్యాప్తయ్యామితరత్న కాంచనవిభూషాపాదన ప్రక్రియా
దక్షంబుల్ కలశంబులెన్మిదియుఁ జెంతండాసిరాఁగా సరో
జాక్షుం దానభిషిక్తుఁ జేయును సహస్రాక్షుండొగిన్ వానిచేన్॥

చ॥ ఇది యమరేంద్రునాజ్ఞ వినియించితిమీకు నృపాలులారయం
చుఁదెలిపి బాలసూర్యసమశోభిత సన్మణి సింహపీఠము
య్యదుపతికిచ్చి నాకమునకాదివిజేంద్రునిదూతయేఁగెబ
ల్మదమునఁ గైశికుండు నృపముఖ్యులనందఱఁజూచియిట్లనన్॥

చ॥ అమరవరేణ్యుశాసనమునందఱువింటిరిగాదె ధారుణీ
రమణవతంసులార సురరాజు సురావళితోడ నంతరి

క్షమునను నిల్పి శౌరిఁగలశంబులచే నభిషిక్తుఁజేయుట
ప్రముఖవిదులలాభంబునగుఁ బాపహరంబది చూచువారికిన్॥

క॥ అనినవినిమాగధాదులు। మనమది నెలకొన్న వైరమున వాసవశా
సనభయమున నచటికిఁబో। కనుమానమునఁజాలకున్న నత్తఱి మింటన్॥

సీ॥ అంభోధరధ్వాన గంభీరభాషల నశరీరియగుచుఁ జిత్రాంగదుఁడను
దూత యిట్లనియె భూనేతలార త్రిలోకపతియింద్రుఁడంపె నానతివినుండు
వైరంబుశౌరితోవలువనుమీకుఁ దత్సఖులరై స్వస్వరాజ్యముల మనుడు
నరులకుదైవముల్ నరపతుల్వారికి సురలు వారికివజ్రధరుఁడతనికి
విష్ణుఁడగుఁ బ్రభుతాతఁడీకృష్ణుఁడైజ। నించెనరరూపమున నితనినభిషిక్తుఁ
జేయునీశానుఁడునుఁగార్తికేయుతోడ। ప్రమథతతిగొల్వనిఁక వేఱపలుకనేల॥

సీ॥ మాకునరేంద్రాభిషేకంబుగావింప నధికారమించుకంతైన లేదు
నరులకుఁగలదుకాన నృపాలులార మీరలుసనిగ్రథకైశికులగూడి
హరినిఁగృష్ణునిఁ ద్రిలోకాభివందితు నభిషేకింపుఁడిదియె భజింపఁదగిన
కాలమ్మనితలంచి వేలుపుఱేఁడు మీకెఱిఁగింపఁబనిచె మున్నెల్లవార
లును ప్రథమశాసనోక్తులువినికాదె। యలజరాసంధరుక్మిసాళ్వాదులైన
నలువురుస్వయంవరశుభాంగణమునను౦డి। యరుగుడందఱునృపులుత్సవార్థమటకు॥

వ॥ అనియిట్లు నిలింపపతిపంపిన మంగళసందేశంబు చిత్రాంగదునివలననెఱింగి సర్వ
సర్వంసహావరప్రవరులును జరాసంధునివలన నాదతివడసి స్వయంవరరంగంబు వె
డలికడలివెల్లివాఁడిచిన వడువునెడనెడం గదుకొనెడు తమతమపరివారంపులం
గూడితనవెంటనంటినడువఁ గదునడరు చింతాభరంబుతో వారిందోడ్కొని భీ
ష్మకనృపాలుండుగోపాలదేవుండున్న కైశికనివాసంబునకరుగుచునగ్రభాగంబున॥

సీ॥ వర్ణనీయానంత వైజయంతికలతో రత్నదివ్యధ్వజప్రతతితోడఁ
చిత్రమాంజిష్ఠభాసిత వితానములతో విమలముక్తాతపత్రములతోడఁ
చింతామణీ భవ్యసింహాసనంబులోఁ గల్పప్రసవదామకములతోడ
మరకతమాణిక్యమయతోరణములతో దివ్యభూషాంబరాదికములతోడ
నలరఁగసమంతలోవిమానావృతాంత। రంబునటదప్సరో నివహంబుగాయ
దఖిలగంధర్వమాగధాన్వితస్తు। వన్మునిగణంబునైన దేవసభగనియె॥

మ॥ కనిభూపాలకులందఱుల్మనములంగౌతూహలంబబ్బురం

బునుఁ జెల్లుబ్బఁగ భీష్మకావనిపుఁ డంభోజాక్షుఁ డున్నట్టియా
ఘనసంసత్ప్రవిధంబు సేరనరుగం గాఁ గ్రైశికక్ష్మావరుం
డు నెదుర్కొంచును వచ్చి వారలను దోడ్కొంచుం జనెన్ లోనికిన్॥

దండకము.

ఇట్లు సర్వక్షమాధ్యక్షులుం దత్సభాభ్యంతరంబందు నల్వంగ నప్పట్టునన్ యక్ష గంధర్వ దివ్యాప్సరస్సిద్ధ విద్యాధరుల్ కిన్నరుల్ గొల్వ నాకాశ వీథిన్ వ్యమా నా సమాన ప్రభల్ నిండ గండస్థలీ హిండితాఖండ మాణిక్య రుఙ్మండలీ ప్రస్ఫురత్కుండలుండైన యాఖండలుండున్ లలాటద్వయన్యస్త హస్తాంజలి శ్రీకరుండైన వైశ్వానరుండున్ సుధర్మంబునందుండి యాదండియున్, భక్తి శోభాసనాథుండు కోణాధినాథుండు జంభద్విషత్సన్నిభుండౌ ప్రతీచీవిభుండున్, మహాసత్వగంభీరుఁడౌ నాశమీరుండు, నక్షీణఫాలాక్షలబ్ధ ప్రసాదుండు శ్రీదుండు, సద్భక్తసంగక్షణాధీనుఁ డీశానుఁడున్ దివ్యతేజోవికాసంబులో స్వస్వదిగ్భాగసంస్థాయులై చామరచ్ఛత్ర ముఖ్యంబులం దాల్చి సేవింప నీరేజకల్హార భృత్తోరణ వ్రాతమల్లార్పఁ గర్పూరకస్తూరికా సాంకవ శ్రీమిళద్గంధ సారాదులన్ ఖేచరీబృందముల్ వ్రాల్పఁ దన్మేదురామోదముల్ ఘుమ్ముఘుమ్మంచు భూమ్యంతరిక్షంబులం గ్రమ్మఁగా నారదాదుల్ సనందాదులున్ సామగానంబు వీణా నినాదాన్విత స్ఫూర్తిగా వింప బంగారు సింగారపుం బొంగరాలంగరం బెచ్చి పొంగారు చన్నుంగవల్ హత్తి కొత్తాణి ముత్తెంపు జెత్తుల్ చలత్తారకా వారముం గేర తర్ఝుంత ధిణ్ణాం ధణాంత క్రేటత్తాహత ద్ధిమ్మితక్రుందరీయంచు రంభాది రంభోరువుల్ బిందుహల్లీస కప్రాంతచాళీయక ప్రేరణ ప్రేంఖణాద్యుల్ల సన్నృత్యముల్ సూపఁ దన్మంగళాంగద్యుతుల్ విద్యుదుద్యత్ప్రభల్ గాభువిన్ వేణు వీణామృదంగాదిని స్వానమిశ్రంబులై వ్యోమసీమన్ సుపర్వస్వనద్దుందుభిధ్వానముల్ భీమగర్జార్భటుల్ గా సమస్తామరీ హస్తవిస్రస్త కల్ప ప్రసూన ప్రతానా వృతానల్పమాణిక్య కుంభాళి నిర్యత్సుధాధారలన్నిర్జరేంద్రా సితాభ్రింబు వర్షింప నప్పట్టునన్ సర్వ రాజన్యమాన్యుల్ మహారత్న సౌవర్ణ భూషాంబరాహీన దీనారటంకాదులర్పించుచుం బుష్పగంధాదులం బూజఁ గావించి రీరీతి శ్రీకృష్ణదేవుండు లోకత్రయారాధ్య పట్టా

భిషేక ప్రభావోజ్జ్వలుండై సభాభ్యంతరానంత చింతామణీ భవ్య సింహాసనంబందు మాణిక్య కోటీర కేయూర హారోల్లసత్కుండల లాఖండలశ్రీల్ దిశల్ నిండఁ దోల్గొండ నెత్తమ్మునందుండు నత్తమ్మిచుట్టంబునుంబోలె నాసీనుఁడైయుండ నద్దండధను ద్దండ సత్యాధ్యుఁడై దక్షిణప్రాంత పీఠంబునం గామరూపంబుతోఁ బొల్చుతార్క్ష్యుండు సవ్యామపార్శ్వస్థ పీఠంబులం గైశికుండుం గ్రథుండుం బిరుండర్ గదా క్రూరమాఖ్యానుజుల్ వారి సామీప్యమందల్ల వృష్ణ్యంధక శ్రేణులున్నుండర్ భీష్మకాదిక్షమేశుల్విదిక్ష్మమలందెల్ల భూనాథులర్ స్వస్వ సింహాసనారూఢులై కొల్వ నిండోలగంబుండఁగా నీతిశాస్త్రార్థ విజ్ఞానవాగ్ధోరణీ నైపుణీదక్షుఁడౌ కైశికక్ష్మాతలాధ్యక్షుఁడజ్ఞాతునం దద్విధిం బూజగావించి యాశౌరితో నిట్లుపల్కుం జగద్రక్షణాధార యోదేవదేవా నిస్మర్త్యగా నీయశేషావనీవల్లభశ్రేణి భావించె నాహావరబ్రష్టామీవంచులో నెంచ లేదయ్యెనోయయ్య నీవే సహింపందగుర్ వీరి యజ్ఞానమున్ వాసుదేవాయటన్నర్ ముకుందుండు దాఁ బల్కె నో కైశికా వైర మెవ్వారియందేని నాకొక్కనాడుంబ్రవర్తింప దీయుర్విలో క్షాత్ర ధర్మంబు యుద్ధంబు భూపాళికందీల్గుటల్ శాశ్వత స్వర్గ సౌఖ్యావహంబుల్ రణోద్యుక్తికిన్వీఁగుటల్ రాజధర్మేతరంబుల్ నృలోకంబునం బుట్టువారందఱుం గిట్టువారేకదా క్రోధమెవ్వారిపై నేమిటం గల్గు మాకంచు వెన్నుండు పల్కంగ నప్పట్టునన్ భీష్మకక్షోణిపాలుండు గోపాలు సద్భక్తి నర్చించి తానిట్లనుర్ మత్సుతుండజ్ఞతన్ సోదరిర్ రాజసంఘంబు రావించియుం దర్పుఁడౌ వానికర్పింప నూహించె నాకట్లు సేయంగ దలంపొగ్గదయ్యెం దదీయోద్యమం బేనెఱుంగంద్వదీయాగమంబే మదింగోరి యర్పింపఁగా నున్నవాఁడం బ్రసన్నుండవై మత్కుమారావివేకక్రియర్ సైపుమో లోకనాథా యనం దోయజాతేక్షణుండిట్లు వక్కాణి నరేంద్రోత్తమా నీతనూజుండు ముగ్ధుండయేనిన్ మహారాజులం జంద్రసూర్యాగ్నితుల్యోజ్జ్వలత్తేజులం బిల్వనంపించి రావించి తన్మంగళోత్తుంగ శృంగారరంగం బలంకార లీలానుమంగంబుగాఁ గూర్చునేయూపనుల్వ్యర్థమై చెదంబులౌనే యవట్లుండ నిమ్మేళనెఱుంగంద్వదీయోద్యమంబంటివీ సర్వదేశాగతక్ష్మావరశ్రేణికిం దత్తదర్హక్రియాతిథ్యముల్ సల్పితీ వేకడా యీశతాంగాశ్వమాతంగ పాదాత సేనాసమేతంబుగా వచ్చియున్నట్టి మారాకమీకప్పుడజ్ఞాతమా యద్భుతంబయ్యెనా మీకెఱుంగంగ రాకుంటచే గాయపాత్రుండనా నాకు నాతిథ్యముల్ సేయరై రిప్పుడర్ఘ్యుండ నెట్లౌదు నాకేల మీకన్య కన్యాన్యుఁడౌ వానికీయందగుర్ మీరలీకున్నఁ దక్కన్యకా విఘ్నదోషంబు నాకేలచేఁ గల్గె

డుందానిచే నారకప్రాప్తియౌనంచు మన్వాదిశాస్త్రంబులుం దెల్పె నిట్లౌట నూహిం
చిమీవీటిరంగంబు నేఁజేరకిచ్చోట సేనాదివిశ్రాంతికిమ్మాటచే నీవిదర్భంబునందుండి ని
త్యాతిథిప్రీణనాసక్తుఁడౌ కైశికాధీశుచే సేవ్యమానుండనై కంటి నాతిథ్యమంచుం దగం
బల్కి శాంతాననలంబైన యాగంబు చందంబునన్ మిన్నకున్నట్టి యాశౌరితో వెండి
యున్ భీష్మకుండిట్లనున్ సర్వలోకాధ్యయో దేవయజ్ఞానతామిస్రసంఛన్నతన్ మీమహా
త్త్వంబుఁ గానంగలేనట్టి మూఢాత్ములన్నమ్ము విజ్ఞానదృగ్దాతవై కావవే నీదయాదృష్టి
యొక్కింతమైఁ బర్వినన్ మాకశేషార్థసాఫల్యముల్ గల్గు నీపాలవర్తించి నేనిర్భ
యాత్ముండనై యుండెదన్ రాజులందేరికిన్ నాదుకన్యన్ స్వయంవర్యగా నింక నేనీఁ
దలంపన్ దయాళుండవై నెయ్యపుంజూడ్కి మాపైఁ బ్రసాదింపవే యన్న నాతేనితో
యాదవేంద్రుండు దానిట్లనున్ భూపవర్యా త్వదుక్తంబులౌ వ్యర్థవాక్యంబు లింకేల
యాకన్యనియ్యంగ మానంగ నెవ్వాఁడు శక్తుండగున్ మేరుకూటంబునందొల్లి జేజేలపె
ద్దానతిం జెంది యంశావతారంబుగా నొక్క హేత్వంతరావాప్తి నీకుండి సంబంధ నీపట్టి
గా రుక్మిణీనామధేయంబునం బుట్టె శ్రీదేవి యీమర్మముం జెప్పితింగాన మద్వాక్యము
న్నమ్మి యాయిందిరారూపిణిం జేకొనందక్షుఁడౌ తత్సమానున్వరుం గోరి యీయంద
గుం గాక రాజన్యమాత్రుల్ వరింపన్ క్షముల్ గారు మర్త్యాకృతిం బూను శ్రీవిష్ణుఁడీ
వీటికిన్ రాజవర్గోత్సవంబున్విలోకింపఁగా వచ్చుటం జేసి కాదే పతంగేంద్రుఁడు
న్వచ్చె నస్మం దదారోహకుం గామదిన్నమ్మి శుద్ధాత్ములౌ త్వాదృశక్ష్మావరశ్రేష్ఠులం దెప్పు
డున్నాకుఁ గోపంబు వర్తింప దెన్నన్వయోరీతి మాతండ్రితోడన్ సమానుండవీవౌటచే
మాకుఁ బూజ్యుండవింకం ద్వదీయాధిరాజ్యంబు ధర్మంబుతో నేలుచున్ సౌఖ్యవం
తుండవై యుండుమీ కైశికుండుం గ్రథుండున్ స్వరాజ్యంబు నాతిథ్యరూపంబుగా మా
న్న నాకిచ్చుటం జేసి తద్వంశపూర్వాపరుల్ తద్దశఖ్యాతసంఖ్యన్ దివంబఁదువర్తిం
తురీయిర్వురుం జెక్కు కాలంబు రాజ్యంబు పాలించి యాపిమ్మట న్నాకమందుందురీయ
స్మదీయాభిషేకార్థమై వచ్చియున్నట్టియీ రాజవర్గంబు న్వర్గంబునన్ భోగముల్
గాంచు నాకానతిండింక మాపీటికి న్వేజనంగావలెన్నేడటంచున్ మణీపీఠికం డిగ్గి య
క్కొల్వువారందఱున్ లేచి మ్రొక్కన్నిజస్యందనాసీనుఁడౌచున్ సకోటీర సాహస్ర
శీర్షంబునన్ భూరికేయూర బాహాసహస్రంబులుం జంద్రసూర్యాగ్నిచక్షుస్సహస్రం
బులున్ మంజుమంజీర పుంజాంఘ్రికంజాత సాహస్రముల్ దివ్యమాల్యాంబరామూ
ల్యభూషావళీ భవ్యగంధానులేపంబులుం గల్గి చక్రత్రిశూలాద్యనేకాయుధోపేతమై స

ర్వలోకాద్భుతంబై దిదృక్షూచ్చటాదుర్నిరీక్ష్యంబు దేదీప్యమానంబునై యొప్ప స్వాయంభువంబౌ విరాడ్రూపముం జూచి నిశ్చేష్టులై యందఱుఁ బొమ్మలట్లుండ నవ్వేళ నవ్విష్ణుపుర భీష్మకోర్వీవరుండాత్మవాఙ్మానసాంగంబు లేకంబుగా నీక్రియఁ సన్నుతించెఁ హరే త్వం జగజ్జాలకతాఁ నిభతాఁ నివిష్ణో త్వదీయం మహత్వం ప్రవిజ్ఞాతుమజ్ఞోద్భవాద్యానశక్తాః కిలాహం కియాన్ దివ్యమూర్తే మదీయం హి జన్మాద్య ధన్యం [illegible]వప్రపన్న[illegible]దయాళో భవద్భక్తమజ్ఞానినం మామవ శ్రీమతే నిర్గుణాయ ప్రపంచ ప్రధాన ప్రధానాయ నిత్యాయ హంసస్వరూపాయ సృష్టిప్రవృద్ధ్యంత కర్త్రే జగన్మంగళాపాదినే వేదవేద్యాయ నారాయణాయాచ్యుతాయాదిదేవాయ వైకుంఠ సంవాసినే స్థాణురూపాయ విశ్వాత్మనే వేధసే పద్మనాభాయ జేత్రే పరబ్రహ్మణే వాసుదేవాయ తుభ్యం నమస్తే నమస్తే నమః.

మ॥ అనిభక్తిన్వినుతించి భీష్మక ధరాధ్యక్షుండు ప్రొక్కంగ నం
తన పూర్వాకృతిఁదాల్చి తేరునఁ బ్రసన్నత్వంబునం దోఁచుకృ
ష్ణునకుం గానుకగా సమస్తనృపులుం జూడంగ నర్పించె వ
జ్రనవాంభోరుహ రాగముఖ్యమణిపూర్ణ స్వర్ణభూషాదులన్॥

మ॥ ఖగనాథాయనమోస్తు తేయని విహంగస్వామికిన్ మ్రొక్కి చె
న్నగురత్నాభరణంబులిచ్చి హరితోనాతండు వీడ్కొల్పినన్
ఖగనాథుండును సర్వరాజరథ సంఘాతంబులున్వెంటరా
జగదీశుండరిగె న్వెసన్ మధురకున్ శంఖధ్వనుల్ మించగాన్॥

గీ॥ తమతమనివాసములకేఁగిరమరులునృపు। లందఱునుఁగ్రోశమాత్రమజ్ఞాతులతోడఁ
జనియచటఁదదనుజ్ఞఁగైకొనుచుమరలి। కుండినము సేరి నిండుకొల్వుండిరెలమి॥

సీ॥ గమనోత్సుకతఁబూని కనకరత్నాసన గతులై సుపర్వేంద్రకల్పులైన
నానానృపులఁగొల్వునఁ గనుంగొని సునీతివిదుఁడైన భీష్మకోర్విభుండు
ముసలినేనగుటనో వసుధాధ్యులార స్వయంవరకృతమదీయాపరాధ
మునుమీరలు క్షమింపుఁడనుచు నర్హవిధి సత్కృతులుగావించి యానతినొసంగ
ప్రాగుదక్పశ్చిమాంతరభాగదేశ। నృపతులేఁగిరి తనతమ నిలయములకుఁ
బిదపభీష్మకుదెసఁజాలప్రియముగల్గి। తదభిప్రాయోక్తులనువినఁదలఁచి మతియు॥

వ॥ జరాసంధసునీథ దంతవక్త్ర సాళ్వమహాకూర్మక వేణువారి కాశ్మీరాధిపతి ప్రము
ఖులును దక్షిణదిక్కునంపు చక్రాంగలదేశాధీశులునుం గొల్వుననున్నంగనుంగొ

ని భీష్మక నృపపుంగవుండు మంగళనయానుషంగ ప్రసంగవచనంబుల నిట్లనియె॥

చ॥ కొమరుని సేఁతలెన్నఁగలుగుణ భయసంవృతమౌచునాదుచి
త్తము మఱి సర్వలోకవినుతంబగు శాశ్వతకీర్తి యుం బరా
క్రమమునుఁ బూనుసత్పురుషరత్నముఁ గృష్ణునిఁగన్న దేవకీ
రమణిసమగ్రభాగ్యముఁదరంబె ధరన్వినుతింప నేరికిన్॥

చ॥ అనవిని సాళ్వుఁడిట్లను జయాజయముల్ నియతంబులాజిశూ
రునకుభవత్తనూజుఁడగు రుక్మి సముజ్వలవిక్రముండు భం
డనమున భార్గవాస్త్రము దొడంగి యెదిర్చిన నెవ్వఁడోపునా
తనికలకృష్ణుఁడవ్యయుఁడటంచుఁ గడంగుటమానెఁ బోరికిన్॥

వ॥ అనియిట్లు పలికిన సాళ్వవచనంబులకు సంతసించి జరాసంధాదులు సముచితప్రకారంబుల భీష్మకమహీనాథు నానతింబూని తదాస్థాని వెడలి నిజస్థానంబుల కరిగి సుఖంబుండిరనిన విని జనమేజయుండవ్వలి కథ నెఱిగింపుమని వైశంపాయను నడుగుటయు॥

మ॥ అమరశ్లాఘ్యచరిత్రపండిత సమాజాజ్ఞావళీమిత్రవా
క్కమలాసుందరమందిరా యితర సజ్ఞానేత్రభూరిప్రభా
రమణీయోజ్వలగాత్ర ధైర్యపటిమ ప్రాలేయవద్గోత్రవి
క్రమలాక్షీమణిభూషణాయితగుణా కారుణ్యవీక్షాగణా॥

క॥ విద్యానూతనభోజా। ప్రద్యోతిత వాగ్విలాసఫణిరాజసుధీ
హృద్యానవద్యగద్యసు। పద్యాళీభరితసత్ప్రబంధ సమాజా॥

స్రగ్విణీవృత్తము॥ సాంగసామ్రాజ్యపట్టాభిషేకక్రియా
సంగసంతోషితక్ష్మాసుతావల్లభా
మంగళోపేతహైమాసుకీర్తిద్యోప్రసమో
త్తుంగసౌధోల్లసద్భూరి విద్వత్సభా॥

గద్య॥ ఇది శ్రీమన్మహాభారతీ ప్రసాదాసాదిత కవితామతల్లికాల్లమరాజా
కారత్నారామద్రావిడ ముఖ్య రంగధామార్య తనూభవహరితసగోత్ర
పవిత్ర సుకవిజన విధేయ సుబ్రహ్మణ్య కవి నామధేయ
ప్రణీతంబైన శ్రీకృష్ణకళ్యాణంబను మహాప్రబం
ధంబునందు ద్వితీయాశ్వాసము.

శుభమస్తు.

అవిఘ్నమస్తు

# శ్రీ కృష్ణ కల్యాణము.

## తృతీయాశ్వాసము.

క॥ శ్రీలానీలా సదృశమ । హాలక్ష్మీసంజ్ఞనిజవరారోహాద్య
జ్జీలోత్పలచంద్రముఖ । లీలారామేశభోగలేఖాధీశా॥

వ॥ అవధరింపుము॥

క॥ ఘనుఁడగు వైశంపాయన । ముని జనమేజయనృపాలముఖ్యున కెఱిఁగిం
చినరీతి శౌనకాదులఁ । గనుఁగొని సూతుఁడిటు చెప్పఁగాఁ దొడఁగె నొగిన్॥

గీ॥ అట్లు కృష్ణుండు మథురాపురాంతరంబు । సంప్రవేశించి జననీజనకులు సఖులు
నన్నదమ్ములు శూరసేనాదినృపులు । సంతసిలఁ గొన్ని దినములచ్చటనయుండె॥

మ॥ ఒకనాఁడన్నయుఁ దాను మంతనమునందూహించి యప్పశ్చిమా
బ్ధికిలోనందగు గొప్పతిప్పపయి నుర్వీలోక వైకుంఠమై
ప్రకటఖ్యాతిఁగ ద్వారకాపురి సృజింపం దార్క్ష్యతో దేవవ
ర్ధకినంపింపఁ దదాజ్ఞఁ బూనిచని యాతండట్ల కావించినన్॥

సీ॥ నునుకుందనపుగోడలను విన్దరము మేడలను నందమగు వాడలను దనర్చి
తొగరోల్కుపగడాల తెగతళ్కు-మొగరాల వగగుల్కు-మొగసాలలఁ గడుమించి
సిరిఁగాంచు నల్లిండ్ల దరినించు వాకిళ్ళ నెఱిమించుల నగళ్ళ నొఱపు నెఱపి
బలుహాటక కవాటములవాటమగు కోటలను దోఁటలను పేటలను జెలంగి
తొగలరాచట్టు మేల్జగాజిగిజిగి లెల । దమ్మికెంపులయోరులఁ దగు గవనులఁ
గ్రొత్తముత్తెంపుఁ జికిలిముగ్గులఁ గలిమికిఁ । గాపురంబుగఁ దగు ద్వారకాపురంబు॥

ఉ॥ ఆనగరంబు పెంపుఁగని యచ్చెరువై యనిమేషవృత్తిలోఁ
బూనెదివంబు తాపమును బొందెను పావకుపీడుభీతినీ
రైనిలిచెన్ జలేశపురి యంతవడంకె మరుత్పురంబు దా
వేనలు పెక్కు మున్నలక వెల్వెలబారె గిరీశుప్రోల్వడిన్॥

ఉ॥ అందు నిరంతరంబును సమస్తధనోన్నతులెల్ల వారికిం

పొందగ శంఖముఖ్య నిధులోలిఁ గుబేరుఁడు నిల్వ వేల్పువీ
టం దగు నా సుధర్మ నను గడంక మెయిన్ హరియాజ్ఞఁ దెచ్చి తా
నం దులవాయు దేవుఁడు మహాద్భుతవైఖరి నుంచె నయ్యెడన్॥

మ॥ నిరతంబున్ బహుదివ్యవైభవములన్ దీపించు నా ద్వారకా
పురిలో నన్వసియించెఁ గృష్ణుఁడు నిజాప్తుల్ దల్లిదండ్రుల్ సహో
దరులుం జుట్టలు నుగ్రసేనముఖులౌ ధాత్రీశులున్ యాదవో
త్కరమున్ లోనగు వారిఁ దోడుకొని భద్రంబౌ ముహూర్తంబునన్॥

సీ॥ కాశ్మీరపత్త్రి ప్రకాశంబునఁ జెలంగి భద్రేభయాన విభ్రమము నెనసి
లాలితసత్కలాపాళులను వహించి విలసిత కలరవోక్తులను మించి
యతిపయోధరవిలాసాంచిత వసతియై తిరమైన సరసులగరిమఁ బూని
అతనుచంచలపతాకాలోకములఁ బోల్చి మృదులాస్యచిత్రసంపదల నలరి
వారసతిరీతిఁ దగు ద్వారవతి వసించి। శౌరి యమరావతిని సురేశ్వరుఁడు బోలె
నఖిలనిజపరివారసమగ్రుఁ డగుచు। నొగి సుధర్మను నిండుగొల్వున్నతఱిని॥

సీ॥ పైనంజ కెంజాయ బర్విన శరదభ్రమనఁగఁ బెన్ జడలతోఁ దనువు మెరయ
హరిపదానిలహతి నలరారు మహతి శ్రీహరి పదసంహతి వరుసఁ బలుక
సంతానశాఖి కాంచలపక్వఫలలీల వలకేల మణి కమండలువు గ్రాల
అళిపాళికలపోలికల నెలి కమలాక్షమాలికలలకంఠపాళి నొనర
గోపిచందనపుండ్రవల్లీపటురుచి। నిటలతటమున దీపింప నింగి నుండి
పురములోడిగి జూపరకరుఁదు దోఁప। నారదమునీంద్రుఁ డరుదెంచె శౌరిఁ జూడ॥

చ॥ అమరమునీంద్రు రాక ప్రతిహారి రయంబున విన్నవింపఁ బ్రీ
తి మెయి నయ్యుగ్రసేన వసుదేవ బలాదిపురస్సరంబుగాఁ
గమలవిలోచనుం డెదురుగా నరుదెంచి నమస్కరించి సం
యమివరుఁ దోడితెచ్చి కనకాసన సంస్థితుఁ జేసి తత్సభన్॥

గీ॥ అర్ఘ్యపాద్యాది సద్విధులాచరించి। యాత్మసింహాసనాసీనుఁ డగుచుఁ జెంతఁ
దత్తదుచితాసనముల నందఱను నిలిపి। వినయమివురొత్తు సూక్తుల ననియె నిట్లు॥

ఉ॥ సేమమె నీకు వేల్పులకు సేమమె వజ్రికి భద్రమే దివిన్
భూమి నమస్త దేశముల భూవరపాళికి లెస్సలేకదా
యీ మెయి సర్వలోకముల నెల్లపుడుం జరియింతువో మునీం

ద్రిమది నీవెఱుంగని యుదంతమొకింతయునైన నుండునే॥

చ॥ క్షమగలవారికింబ్రబలెఁజల్లదనంబులు పుణ్యశాలివ
గఁ మునకుఁదృప్తియయ్యెఁగళరంజిలె నాయదుజాతికుజ్జ్వల
త్వముగడు నెమ్మిబల్పురికి వన్నెఘటిల్లెఁ ద్వదాగమంబున
న్సముచిత నారదాగమమునన్ మఱియట్లగుఁగాదె నారదా॥

మ॥ అని శ్రీకృష్ణుఁడువల్కినన్ మునివరుండాశౌరితోఁ బెండియు
ట్లనునో దేవశరణ్య యాదవ వరేణ్యా నీదుకారుణ్యదృ
ష్టిని నాకున్నిఖిల ప్రపంచములకున్ సేమంబులెల్లప్పుడుం
బొనరుం దావకభక్తకోటికి శుభంబుల్గాంచుటాశ్చర్యమే॥

క॥ మునువైకుంఠములోనే। యనువునవర్తించుచుండువట్లీపురిలో
నను వెలసిన నినుఁగన్నలఁ। దనివియొసఁగఁగంటి నేఁడు ధన్యుఁడనైతిన్॥

పంచచామరము॥ నమోనమస్సమస్తలోకనాయకాయజిష్ణతే
నమోనమః ఖగేంద్రవాహనాయభూచరిష్ణవే
నమోనమశ్శమక్షమాది నాహ్యలంకరిష్ణవే
నమోనమోనమామహస్తుతే సనాతనాయవిష్ణవే॥

గీ॥ అనుచుభక్తిజనితహర్షబాష్పాకుల। నేత్రుఁడై పులకిత గాత్రుఁడగుచు
నబ్జనయను నాననాబ్జంబుపైఁదన। చూడ్కి నిలిపిచిత్తశుద్ధి వెలయ॥

లయగ్రాహి

కాంచిమణికాంచనసమంచితవిపంచి ధరియించి శ్రుతినించిపలికించుతఱితంత్రీ
సంచయముసారెలనటించి యమృతంబుచిలికించుగతి మూర్ఛనలబెంచికళలన్రా
ణించుఘనరాగములనంచొనరు తానముల నెంచివిహరించర్యలెనయించివరునన్వా
యించెనపవర్గమునఁగాంచుసుఖమిట్టిదయటంచుఁబెరవారి కెఱిగించుగతిమించన్॥

సీ॥ అమ్మహాగాన సుధాబ్ధిలో హరికథాకల్లోలముల నిమగ్నాంతరంగు
లైచేష్టలుడిగిచిత్రాకృతులుగఁ గొల్వునందు యాదవులరుదందిచూడ
నందనందనుఁడు సానందతనొంది శతానందనందనుతో నిటులను
నోమహాయోగీంద్ర మామకపూర్వావతార కథామిళద్గానమిదియొ
దీనిసరిగానమీవినోదానుభూతి। చాలునిఁకమీరువచ్చినమేలుకార్య
మెయ్యదిరయొ తద్విశేషంబు నెఱుకపఱపుఁ। డనిననతఁడిట్లనియె వీణసవటడించి॥

క॥ దేవరవారికగోచర । మౌవృత్తాంతంబు జగములందెయ్యెడలం
దావంతయులేదైనను । వేవినుఁడొకమనవి విన్నవించెదకృష్ణా॥

మ॥ కమనీయంబగు దక్షిణాబ్ధిదరి గోకర్ణాఖ్యమాక్షేత్రరా
జమునన్రాజిలు లింగరూపధరునిం జంద్రావతంసున్ శివుం
బ్రమదంబారగ గీతసన్నుతుల సంభావించి సేవించిశీ
ఘ్రిమయేనుత్తరదిక్పథంబునఁ జనంగా నవ్విదర్భంబునన్॥

గీ॥ కుండినపురంబునన్ భీష్మకుండునన్నుఁ । గాంచిసముచితసత్కారగౌరవమునఁ
దనసభకుఁదోడుకొని యేఁగి కనకపీఠ । మునననుప నప్పుడాసభాముఖమునందు॥

శా॥ నానాదేశమహీశబంధుహితబృందంబుల్ ప్రవేశింపనా
లోనన్ మాగధభూవరుండు శిశుపాలుండుం గులాహార్యసం
తానాంతస్థితమేరుసుందర గిరిద్వంద్వంబురీతిన్ సుఖా
పీనుల్ గాఁగని యేనువీరిటకు విచ్చేయంబనేమన్నచోన్॥

శా॥ నాతో గుండినభర్త యిట్లుపలికెన్ మానీశ్వరా మత్తనూ
జాతన్ రుక్మిణిఁజైద్యభూవరునకిచ్చం బెండ్లిసేయంగసం
ప్రీతింబిల్చిన వచ్చియుండిరిట నీపృథ్వీశులెల్లుండియా
ప్రాతర్వేళ వివాహమన్న వినితద్వార్తన్ భవత్సన్నిధిన్॥

ఏకప్రాససీసము.

విన్నవించుటకునీయున్నచోటికివచ్చితిన్నీవు మున్నయక్కన్నెఁగోరి
యున్నాఁడవయ్యన్నుమిన్న నీకర్పింపకన్నరపతి నీద్విషన్నరపతు
లెన్నంగశిశుపాలుఁడన్నామమునఖ్యాతిఁగన్న చైద్యునకియ్యనున్నవాఁడు
మన్నితత్కార్యంబొగిన్నిలువేరిన నిన్నేలయందింతకన్నవేరె
యున్నదేకీర్తిహాని జగన్నుతమగు । చున్నెగడు నీయవార్యశౌర్యోన్నతికిభ
వన్నిరుపమాన మానసంపన్నతకును । మిన్నకుండుటవలదు నమిన్నయాఢ్య॥

ఉ॥ కావున నుగ్రసేనమహీకాంత హలాయుధముఖ్యయోధయూ
థావితమై కదుంబ్రిబలు యాదవసైన్యముతోడ భీష్మక
క్ష్మావిభుపట్టణంబునకుఁ గ్రన్ననఁనీవిపుడేఁగి యచ్చటం
బోరిపుగనున్న చైద్యముఖ భూవరులన్వెసఁ గెల్చి క్షేమిలతోన్॥

పంచచామరము॥ అరాతిరాజరాజిసంగరాతిభీతి బర్వన

వ్వరాంగనం బరిగ్రహించి వాఁడిమించిపోఁడిమిన్
సురల్ నరుల్ నుతింపఁ దెచ్చి సొంపుపెంపు ద్వారకా
పురంబునందు శోభనంబుఁ బొందుమో మురాంతకా॥

గీ॥ నీదుబాహునియుక్తినొందిన సుదర్శ । నంబునకుఁ దీర్పరానియర్థంబులుర్విఁ
గలుగునే తత్ప్రభావంబఖండవిజయ । మండితంబగునది యట్టులుండనిమ్ము॥

మ॥ వినుమే భీష్మకు కొల్వువెల్వడి నభోవీథీగతిన్వచ్చు వే
శనదృశ్యత్వమునొంది చూచితిని లీలామందిరారామసీ
మన వేందూపలవేదిపైఁ బ్రియసఖీమధ్యంబునన్నీదుచిం
తనచే నెంతయు నెవ్వగంబొగులు నత్తన్వీ శిరోరత్నమున్॥

చ॥ కరములఁ బద్మలీలయు మొగంబున నిందుసహోదరత్వమున్
వరవచనంబులందమృతవైభవముం బ్రకటింపుచుండఁగా
నరయుచు నిందిరాంశభవయై తగు రుక్మిణి యీమృగాక్షియీ
నిరుపమ దివ్యరూపయని నిశ్చితచిత్తుఁడనైతినత్తఱిన్॥

సీ॥ భావమెప్పుడును నీపాలవర్తిల్లుటచే నన్యమూహింపదావంతయైన
కనుదామరలు నీదు తనులీలనునుచుట నితరంబు జూడదొక్కింతయైన
శ్రోత్రముల్ నీకథాసుధలనిండుటఁ జేసియానదన్యోక్తిగోరంతయైన
రసననీగుణమధురసములానుటఁ జేసి యంటదన్యరుచిరవ్వంతయైన
నౌరవరయోగసామ్రాజ్య మందజేసె । యోగశైథిల్యకారియై యొనరుమరుడు
దుస్సహాయోగతాపంబు దొరయుచెలికి । విసమురోగికిజీవితమొసఁగునటుల॥

సీ॥ గురుకలాపప్రభాకరమౌటచేఁగృష్ణ ఘనవిభ్రమముఁబూనుఁగలికివేణి
పద్మాహితవిలాసభాసమానంబౌటవిధుశోభనెనయునవ్వెలదిమోము
మృదులరత్నాకరమేఖలాశ్రయమౌటఁదగుననంతాకృతిఁదరుణిపిరుదు
పరవిలసితపత్రగరిమంబగుటభృతచక్రలీలనెసంగునతికుచయుగ
మధికకనకాంశుకశ్రీసమగ్రమగుట । భువనమోహన సౌందర్యమునువహించు
నవ్వధూటీలలామ శుభాంగవల్లి । గానయాచానతగునీకుఁగమలనయన॥

గీ॥ మోహమనువారినిధిలోన మునిఁగితేలు । వనితగన్నులు మీలనవలదె శ్రుతుల
నందవేయవినుమువార్ధియందుమునిఁగి । తేలిశ్రుతులొందునీకుఁ జుట్టాలుగావె॥

చ॥ ముదిత తనూలతాలసితముల్ రదనచ్ఛదపాణిపాదముల్

మృదుతరపల్లవంబులవి మేదురతాపనిదాఘవేళనా
ప్పిదముదొలంగి వాఁడెనిఁక వేచని యింతిని వైజయంతిన
న్లైదఁగదియించి బ్రోవు రసభృద్వరభూరి దయాంబుధారలన్॥

సీ॥ నునుజెక్కుటద్దంబులను జాల్గొని కుచాగ్రములఁజిందు నశ్రులవళులుదడియ
పాటనలేమిఁబాపటసొంపుదొరఁగి శీర్ణాలకల్ ఫాలంపులీలగప్ప
వేఁడినిట్టూర్పులవిసరులవెసరేఁగియుసురేనుపునా యన్న యునిక్కిదోఁప
నివురుగ్రమ్మిన కడాని సలాకలాగున వైవర్ణ్యమునమేనివన్నెసుక్క
నప్పుడఖిలేశ్వరుండైన హరికధీన । నైననామదినావ్యంగ నన్యుదుష్ట
నరునిఁజేకొని రేనిబాణింబులొల్ల । ననిసఖులనాడు చెలువవాక్యములువింటి॥

గీ॥ సఖులుగావించు శిశిరోపచారములశ । మింపనిస్సరతాగ్నిసెట్లు భరింపఁజాలు
నకటకరుణించి వేచని యతివప్రాణ । ములనురక్షింపవే దయానిలయశౌరి॥

క॥ అనిమునిచంద్రుఁడు శ్రీకృ । ష్ణునకంతయు విన్నవించి సూటిందదను
జ్ఞనువడసి మింటితెఱవునఁ । జనియెన్ దనుకాంతిపర్వ చంద్రికకెనగాన్॥

ఏకప్రాస సీసము.

పిమ్మటనాత్మజనమ్ములనందఱ సమ్మకుండుఁడుసమ్ముఖమ్మునగని
యిమ్ముగనీంద్రుని భాషితమ్ములుమీరు సర్వమ్మనువింటిరే యమ్మెయిఁజత
నమ్మొనర్పనగు జయమ్మునుఁగీర్తి సౌఖ్యమ్ములుగాన శీఘ్రమ్ముగాబ
లమ్ములతోమీమీరథమ్ములఁ గట్టాయితమ్ములుగా బయనమ్ముకుండి
సమ్మునకొనర్పుఁడిమ్మహార్తమ్మునన్ర । యమ్ముతోదారకుండు రథమ్ముఁగడుప
నిమ్మహాయుధములుపూని నెమ్మినరిగి । యమ్మహీశులఁగెల్చి యాకొమ్మఁదెత్తు॥

మ॥ అనిచక్రాయుధుఁడానతియ్యఁగఁ దదీయాజ్ఞాప్తిచే యోధయూ
థనిశాతాయుధ దీప్రమైతురగ వేదండచ్ఛటాభీలమై
యనువా యాదవసేనతోబలుఁడు సాత్యక్యాదులాయుగ్రసే
ననరేంద్రుండు రథమ్ములెక్కిపిరుఁదన్ రాఁగంసవిధ్వంసియున్

శా॥ అంభోజప్రభవాండకర్పర విభేదాపాదియైసర్వది
క్కుంభీంద్రోత్కట కర్ణనిర్దళనమై క్రుద్ధద్విడీడ్వ్యాకుభృ
ద్దంభోళిచ్యుతియై కృతాంతగృహ ద్వారప్రతిధ్వానమై
స్తంభీభూత ఘనస్వనంబగుచు యాత్రాభేరి మ్రోయన్నడిన్॥

సీ॥ బాలార్కబింబము పగిదినొప్పలదివ్య రత్నకిరీట విభ్రమము మెసంగ
క్రొక్కారుమెఱుంగులాగున వలెవాటుగా నలరుమేలికడాని వలువ మెఱయ
నింద్రచాపము భంగి నెదమీఁది వైజయంతీమాల కౌస్తుభదీప్తి నెసఁగ
నుదరసంభృతజల ద్యుతిమాడ్కి కుండల హారకేయూర వజ్రాభ వెలయఁ
కనకగిరిమీఁద దీపించు ఘనవినీల । జలధరంబన రత్నకాంచనసమంచి
తోన్నతరథోత్తమము నెక్కి యెన్నఁ డెలమి । వెలువడియె ద్వారకఁ దురథ్యములదోల॥
ఉ॥ ఈపగిది న్మహావిభవ మేర్పడ నేఁగి విదర్భరాజ్యల
క్ష్మీపరిశోభితుండినము జేరఁగ నాహరిరాక భీష్మక
క్ష్మాపతియాలకించి నిజ మంత్రిహితాప్తులతోడవచ్చి యిం
పొపటుభక్తిఁ బూజనము లాదర మొప్పనొనర్చి యాతనిన్॥
సీ॥ ఫలితమై మాధవీ వలితమై మాలతీ కలితమై కదళికా లలితమగుచు
నందమై కృతకనా నందమై రుచిరమా కందమై నమరమాకందమగుచు
సారమై మృదురసా సారమై స్ఫురితకా సారమై కోరకస్ఫారమగుచు
కాంతమై శుకపికాక్రాంతమై వాసితా శాంతమై సలతా నిశాంతమగుచు
చందనామంద మందారకుందవకుల । ముకుళమకరందబిందుతుందిలమిళింద
సుందరీబృందనందిత మందపవన । భవనమై యొప్పు నప్పురోపవనమందు॥
గీ॥ సపరివారంబుగా మహోత్సవము మెప్పఁ । దోడుకొని యేఁగి సిరులతో వేడుకలరు
తత్పురాంగణ పుష్పితోద్యానసీమ । నెసఁగు పృథుసౌధమున విడియించె నెలమి॥
వ॥ ఆసమయంబున.
సీ॥ కొందఱు శ్రీకృష్ణుఁ డిందులకిపు డురాఁ బనియేమొకోయని పలుకువారు
కొందఱు మేనత్తకొడుకు పెండ్లిని సాంబుఁ జూడవచ్చెనొయంచు నాడువారు
కొందఱు శిశుపాలునందితనికి వైర మొనరు నప్పనికిగా దనెడువారు
కొందఱా సుందరి డెందమీతనిఁ జెందె ననివిందు మేమనానాయ నెడువారు
నగుచునన్నగరస్థభూపాళి దలఁప । సైన్యయుతముగ శౌరి యచ్చటికి వచ్చి
యున్నవృత్తాంత మొకయింతి విన్నవించె । నంతరుక్మిణికంతఃపు రాంతరమున॥

తరళ.

అలనిదాఘవిభాకరాతపమంటి క్రాఁగు వసుంధరా
స్థలి నవాంబుదవర్షధారలజల్లులం గడుజల్లనై

రోలమిగైకొను రీతిరుక్మిణి కృష్ణురాక చెవింబడం
గళితభావజతాపయై కుతుకంబునన్విలసిల్లుచున్॥

వ॥ నిజాంతర్గతంబున.

క॥ గురుచింతాసాగరమున । దరిఁగానకయున్ననన్ను దరిజేర్చుటకుం
దరిఁబో లెదరియవచ్చెన్ । దరియగుమన్విభుఁడువేడు ధన్యతఁగంటిన్॥

సీ॥ ననుగారవమునఁ గన్గొనుచుఁ గోరికల నీడేర్చు శౌరికి ముద్దుటింతినగుదు
ననతావియనుఁబోతె మనసునాటినరక్తి రాణింపహరిపేర్మిరాణినగుదు
తొంటినానోముల పంటయైననుఁ జెట్టఁబట్టు ముకుందుని వలతినగుదు
సకలలోకములేలఁ జాలుమేలూన జగద్వల్లభుని ప్రియకాంత నగుదు
నవవిధ చిత్రకేళికానందలీలఁ । బాలునీరునుఁ గలసిన పగిదినైక
మత్యమొనరిన నిత్యదాంపత్య గరిమ । వెలయఁగృష్ణుని కూర్మిదేవేరి నగుదు

చ॥ అనుచువిదర్భరాజ తనయామణి మానస వీధినింత యం
తని వివరింపరాని దగుహర్షముమించ సఖీజనాంతర
మ్మునననివసించె నాభువనమోహను నాఖగరాజవాహనుం
దనరఁదలంచుచుందదఖి నంద్యవిచిత్ర చరిత్రలెన్నుచున్॥

మత్తకోకిల॥ అంతనిక్కడ శౌరియుంజెలువారు పుష్పవనాంత సౌ
ధాంతరంబున నాటిరేయిహితాళితో భుజియించి వి
శ్రాంతిఁజెన్నగు వెన్నెలన్ సుమశయ్యపైఁ బవళించియ
య్యింతి చెల్వముఁ జింతసేయుచు నెంతయుందమకంబునన్॥

వ॥ నిజాంతర్గతంబున॥

శా॥ ఆలావణ్యవతీశిరోమణినిఁ గన్నారన్విలోకించి యే
నేలీలన్మఱియేయుపాయగతిచే నెచ్చోటఁగైకొందునిం
కాలస్యంబును లేదు రేపకడఁ గల్యాణక్రియారంభమా
నాలోనంగనుఁగొంటకున్ సమయమౌనంచు న్వితర్కించుచున్॥

సీ॥ ఇఁకసతీమణిచూపులెదను సోఁకినగాని మరుశరంబులఁగెల్వఁదరముగాదు
యశిరోమణి యాస్యమూముద్దిడినగాని రేతేనిపెంపువారింపరాదు
లలిరాము సల్లాపములను దేలినగాని వెడదకోయిలపల్కులుడుపరాదు
నెనినసంత విలాసిని సుభోగమబ్బినగాని మందానిలు గడువరాదు

ఘనఘనాఘనవేణి సంగతులఁగనిన । గాని యీరాజహంసల కడిఁదియడుగు
రాదువేరొక్కటనటంచురక్తి నెంచు।బలుతమివహించు మించుతాపమునుగాంచు॥
గీ॥ ఇవ్విధంబున భీష్మక నృపకుమారి । కాపరిగ్రహణవ్యగ్రి కాంతుఁడైన
యతనివాంఛిత మీడేర్పనరుగుదెంచు । నధికభాగ్యంబనంగ నిశాంతమయ్యె॥
※ సీ॥ ఇనురాకవిని ప్రాచియిడిన వజ్రాల చేర్చుక్కయోయన వేఁగుజుక్కవొడిచె
నుదయాద్రిపైఁగింశుకోరుకాననము పుష్పించెనాఁ గెంజాయ పెంపుమీఱె
భాగ్యసంప్రాప్తి నాపదనొలంగిన భంగిబారెఁజీకటి పటాపంచలగుచు
పతినిఁబాయకయే వెంబడి నేఁగెననఁ దారకారాజి పంచెబంగాళమయ్యె
నాత్మపాదనిహతి నబ్జారియేఁచఁగైరవిణినవ్వఁ బద్మినివెతమోము
ముడుచుకొనియెననుచుమునుగుక్కుటము దెల్పఁదోనవచ్చెననఁగఁ దోఁచెఁబ్రొద్దు

లయగ్రాహి.

పొందులురథాంగములయందునిరవొందెజయమంది మరుఁడిచ్చెనిజసుందరికి విల్లున్
మందపవనాంకురములందుఁ గడుచల్లదనమొందెను వికాసతలు డిందిముకుళత్వం
బందెనసితోత్పలములందుఁదొలగవిందురుచులం దొలఁగిక్రిందడిగెనందమగుతేటల్
చెందె దిశలందు నరవిందమకరందములవిఁదులుమిళిందముల బృందములకబ్బెన్॥
సీ॥ అట్లుప్రాతర్వేళయగుటయు వసుదేవసూనుఁ డుత్సుకభాసమానుఁడగుచుఁ
గృతకాల్యకృత్యుఁడై ధృత శుభాభరణ భానిత్యుఁడై సహితాప్త భృత్యుఁడగుచు
మనమునరుక్మిణిం గనుఁగొను వేడుక యుప్పొంగ దనదురథోత్తమంబు
తోనవాభ్యుదిత మిత్రుఁడువోలె దేదీప్యమానతేజము దిగ్వితానమొరయ
రహిహలాయుధసాత్యకి ప్రముఖవీరు । లలగదాక్రూరముఖ్యులున్ సాయుధులయి
తమరథంబులతోవెంటఁ దవిలిరాఁగ । నుపవనాంతరమందిరం బపుడు వెడలె॥

మధురగతిరగడ.

అంతకుమున్ను పురాంగణరంగము । లంతిపురము రథ్యలునప్తాంగము

* పాఠాంతరము.

చ॥ అలజలజారి పద్మిని ననహ్ణములో నిజపాదతాడనం
బులనలయింప హెచ్చరికఁ బూనికుముద్వతినవ్వులోననా
కులపడి మోమువంచెనని కుక్కుటవాక్యము దూతచెప్పఁగా
దెలసిరయంబుమీర నరుదెంచెనన్ రవిదోఁచెఁ దూర్పునన్॥

లలవిపణీతటు లాటపట్టులును । చలువమేడలును జదరుపట్టులును
మొదలుగనన్నియు ముత్తెపుముగ్గుల । బొదవినకనకంపుంగ్రొన్నిగ్గుల
జతగుల్కెడు పచ్చలతోరణముల । తతకుంకుమ కర్దమధారణముల
ఘనలామజ్జిక ఛాయమానముల । సునిహితపట్టాంశుకవితానముల
వరరత్నధ్వజ వైజయంతికల । స్థిరలాక్షారస చిత్రభిత్తికల
కైరవహల్లక కమలమాలికల । సారంగీమద సాంకవాళికల
కర్పూరాగరు గంధధూపముల । తీర్పగు యువయువతీ కలాపముల
ఖలుహాటక రంభాస్తంభంబుల । సలలితమణి కాంచనకుంభంబుల
మంగళకరగరి మనుశోభిల్లెను । శృంగారవతులు చెలులపుడెల్లను
శారదరాత్రిని శశికళలంబలె । చారులతలసుమ సంపదలంబలె
పాత్రివ్రత్యానభశ్రేణులువలె । దేవేంద్రసతిని దివ్యాళులవలె
కృతినిరసాలం కృతులంబోలెను । సతినిదివిజముని సతులుంబోలెను
నవరత్నాభరణంబులచేతను । నవనవశుభచిహ్నంబులచేతను
మన్ననఁబెండ్లికొమరి నలంకించిరి । విన్ననువగునెరి వేడుకమించిరి
బలువలపుల విరిబంతితెఱంగున । తలిరువిలుతునెలదంతిపొఱంగున
లలిరతనంపుశలాకచందమున । వలనగుపుష్పితవల్లియందమున
శృంగారముతను వెత్తినలాగున । బంగరు ప్రతిమవిభాసిలుబాగున
జవ్వనపుసిరిప్రసన్నయగుసరణి । మవ్వపుతేటలు మగువయగుకరణి
నింతులలోఁదన కెనలేకధరణి । వింతచెలువమున వెలసెనురుక్మిణి॥

ఏకప్రాస సీసము.

శృంగారగరిమనిభ్భంగినిఁదగునవ్వరాంగినిప్రియవయస్యాంగనాళి
బంగారురతనాల రంగుటందలములో నంగడువేడ్క చెలంగనునిచి
మంగళప్రదసర్వ మంగళయగుగౌరికిం గోర్కెమ్రొక్కింపగంగడంగి
సంగతతూర్య మృదంగాదిరవము లెసంగఁ దదాలయప్రాంగణమున
కుంగొనబుమీరననుపమా భంగరసత । రంగితోత్సవమునఁ జతురంగబలము
లుంగొలువఁగానరుగుదెంచెనంగనలచ । టంగరములూఁతసేయసారంగనయన॥
గీ॥ యానమత్తఱిడిగి మందయానమునసె । దేవళంబుప్రవేశించి దేవిఁగాంచి
తనదుముగ్ధతభక్తి తాత్పర్యయుక్తి । బరిఢవిల్లఁగ బత్సమీపముననిలచి॥

ఉ॥ అంబరపుష్పచందన ఫలాదులనర్చమొనర్చి సర్వలో
కాంబపదాంబుజానత సురాసురనాథ కదంబసాంబ మో
హాంబుధివర్ధనానన సుధాకరబింబ సితాంబుజాక్షుఁగృ
ష్ణుంబతి సేయుమో భువనసుందరి మ్రొక్కెదనమ్మయీశ్వరీ॥

చ॥ అనితలపోసి కేల్మొగిచి యంగనకోవెల కిమ్మమొయ్యనా
యన వెడలెన్ శరత్సమయ హంసిక క్రౌంచగిరీంద్రరంధ్రసీ
మ నరుగుదెంచురీతి నసమాన నవీన వయోవిలాసవ
ర్ధన తనుకాంచనాభరణ రత్నచకచ్చకకాంతులీనఁగన్॥

ఉ॥ అయ్యెడ నయ్యదుప్రవరుఁ డాత్మరథంబు తదంతికోర్వికిం
జయ్యనఁ జేర్చి చూచె విలసత్కలశాంబుధి వీచికాంతరం
బాయ్యనఁ బాసి యచ్చరల యోలమునందగు కల్మిబోటి నా
నెయ్యపు లేమలందు రమణీయతఁ బొల్పగు బాలికామణిన్॥

మాలినీవృత్తము॥ కాంచివిరించి రచించిన మూడుజగంబుల సర్గమునందుఁ బరీ
క్షించిన నిట్టి మహాద్భుతరూప విశేషము లుండునె యీచెలి నా
లించిన హించితి నింతకుమున్ గడ లేనితమిన్ మదినిం కెటు సై
రించెద నీనవలాతను విభ్రమరేఖకనుంగవ కబ్బిన చోన్॥

ఉ॥ భావజు మోహనాంబకము భంగి నెసంగెడుఁ గ్రొమ్మెఱుంగు మే
ల్దీవ తెఱంగునం దురగలించెడి రత్నపుబొమ్మరీతిఁ జెం
ప్పావలపుం ఘటించె నరయంగ నయారె యొయారమోహినీ
దేవత కైవడిం దనివిదీరని రాగభరంబుఁ గొల్పెడున్॥

సీ॥ ఘనకలాపము నెంచు ఘనకలాపము మించు ఘనకలాపము లుంచు కాంతవేణి
అబ్జవైఖరి నేలు నబ్జవైఖరి బోలు నబ్జవైఖరి గ్రాలు నలివమోము
కళ్యాణరుచిఁ గెల్చుఁ గళ్యాణరుచిఁ బొల్చుఁ గళ్యాణరుచి దాల్చు కలికిమేను
సారంగగతి నోపు సారంగగతి నేపు సారంగగతిఁ జూపు సకియచూపు
భద్రకుంభవిలాసంబుఁ బరిహసించు । భద్రకుంభవిలాసంబుఁ బరిభవించు
భద్రకుంభాళిమధ్య కుంభద్రసప్ర । శస్తనిస్తులసుస్తనస్తబకయుగము॥

ఉ॥ ముంగరకెంపు పెంపు నలముంగరమున్నను కావిమోవిరీ
వింగడకొల్పుపొల్పుగల వింగడపుంగను తళ్కుబెళ్కులె

న్నంగననంగబాణము లనంగదగున్ భళిరే ధరిత్రి నీ
యంగనసాటిబోఁటి నరయంగనమంగజు మాయసేతయో॥
ఉ॥ ముద్దులుమూటఁగట్టు నగుమోము మెఱుంగు తరంగపాళికిన్
హద్దులుదిద్దుముత్తరుల యందము కుందమిళిందబృందము
న్నద్దడగించిమించు రదనంబుల చక్కదనంబు వేణి డా
లద్దిరయుద్దిదీనికిదియా నిధియా గుణరత్న రాజికిన్॥
ఉ॥ ఈమెఱుఁగారుకన్బొమలు లీనును జెక్కులటెక్కులక్కజం
బీమృదులాంగపుంగళుకు లీలొగరారెక్కుడు మోవితీవియీ
శ్యామలకోమలాలకల చందము డెందము సందడించెనా
హా మఱియీమిటారిఁ గవయంగలవానిది భాగ్యమిమ్మహిన్॥
మ॥ ఘనతారావళిలోనబాల శశిరేఖారీతి నేతత్సఖీ
జనమధ్యంబున డంబుమీరునిడె యోషారత్నము న్వేగఁ గై
కొననిచ్చో సమయంబు దైవమిచటం గూర్చెంగదా దీనికై
ననురూపంబగుపౌరుషంబు జతసేయంజాలినన్ మేలగున్॥
చ॥ అనియతఁడాత్మఁ దోఁదలఁచు నప్పుడయంగన చెంగటం గనుం
గొనియె నభంగురాంగ భవకోటిసదృఙ్నవమోహనాంగునిన్
గనకకిరీటకుండల సకౌస్తుభదామవిభామహోజ్వలు
న్వనజదళాక్షుఁ బాలిత సనందను నవ్వసుదేవనందనున్॥
గీ॥ అతఁడు శ్రీకృష్ణుఁడగుట నెయ్యంపు చెలులు । గన్నుసన్నలఁ నెఱిఁగింపఁ గన్నెమిన్న
యునునిఁబొడగన్న నవ్యపద్మినివిధమున । బ్రకటితామోదరాగవిభ్రము నెనసె॥
మ॥ మనువిన్నట్టి తదీయరూప మనిశంబున్ మానసధ్యానయు
క్తి నిరూఢంబగుతోఁచెనాఁగ నెదుటందీపించు నాశౌరిఁ గ
న్గొనుచో విస్మయహర్షకంపములు సిగ్గుంగూడి కన్యామతిం
బెనగం బ్రస్ఫుట నేత్రపద్మములఁ గ్రమ్మెన్స్మితలాశ్రుచ్ఛటల్॥
మ॥ ముదమొప్పన్ హరిదివ్యమంగళ లసద్రూపశ్రీన్ శిరంబాదిగాఁ
బదపర్యంతము నింతిచెంచలదృగబ్జాతైక సాహస్రమ
య్యదనన్ ద్రావుచుఁ బూజచేసి మదిలో ధ్యానించెనానిత్యవన్
సుదతుల్చూడ వినిశ్చలాంగియగుచుం జూపట్టె మోహాత్మతన్॥

క॥ సతిచూపునుఁ బతిచూపునుఁ । బ్రతిలేనిసమానరాగభరితములై ప్రీ
చ్యుతివరలన్ ధృతిదరలన్ । గతిమఱలందనుభయాంగకంబులఁ బ్రాఁకెన్॥

వ॥ అంతనక్కాంతారత్నంబు నిజాంతర్గతంబున.

ఉ॥ ఈజగదేకమోహనుని నీబుధలోకశరణ్యు నీశర
ద్రాజవిభాస్యు నీసుగుణరత్ననిధానము నీచరాచర
భ్రాజితవిశ్వపాలనపరాయణునీతని జెట్టవట్టిని
ర్వ్యాజసుభక్తిమైఁ జరణపంకజదాస్యము నేనొనర్చెదన్॥

మ॥ అనియుల్లంబున నుల్లసిల్లు నతిమోహాశ్చర్యపర్యాప్తిమైఁ
జనుగోనల్లరుపారఁ డారకలచంచన్నైగనిగ్యంబులో
చనగోళంబులఁ బద్మనిర్య దళిచాంచల్యంబు జూపన్సఖీ
జనమధ్యంబుననిల్చి తఱగ నెడునాశ్యామాశిరోరత్నముల్॥

చ॥ అరదముడిగ్గి శౌరి కలశాంబుధివెల్వడి యప్సరోగణాం
తరమున నొప్పుకల్మినెలతం గయికొన్నతెఱంగున న్వడిం
గరములఁ బట్టితెచ్చి కనకస్ఫురితాత్మరథంబునందిడెం
బరిజనమెల్లఁ జిత్తరుల భంగిగడున్వెరగంది చూడఁగాన్॥

మ॥ ఘనలజ్జాభయకంపితాంగియగు క్రొక్కార్మించునీలాంబుదం
బునదీపించుగతిన్నిజాంతికమునం బొల్పొందుబింబాధరం
దనుమధ్యం దరళాయతాక్షిఁ దరుణిం దన్వీమణిన్ రుక్మిణిం
గొనియేఁగెన్ దనతేరుసాదిగడుపన్ గోవిందుడప్పట్టునన్॥

క॥ అచ్చటినృపభటులుదొరలు । నచ్చెరువుగఁ గలఁగి కోపమగ్గలికమెయిన్
హెచ్చఁగనిజవాహనముల । విచ్చలవిడిఁ బఱపిరొకట వెన్నునిఁ గదియన్॥

ఏకప్రాససీసము.

కొండఁజుటుకొను వేదండతండముమాడ్కిఁ బుండరీకాక్షుని నిండురధము
దండిమైనరికీర మండలిపొదవి పోకుండనిరోధింపుచుండఁ గాంచి
చండబలుండు బలుండంతటనఁ దన దండరాజిలు భూజమొండు వెరికి
దండుపైనురికి యుద్దండభుజాదండ తాండవంబెసగ నుగ్రుండువిలయ
కాండమునఁ బోలెఁ దీండ్రించి భండనమున । హిండగుగజాశ్వభటతతిగుండెలద్వాః
గండడంచినఁ బగతుల పిండువిచ్చు । చుండుటయుఁ దేజరిల్లెఁ గృష్ణుండునంత॥

గీ॥ అమ్మహోత్సాహమెఱిఁగి సాత్యకియునుగ్ర । సేనుఁడు విదూరదుండుఁ బ్రసేనజిత్తు
గదశతద్యుమ్నులాదిగాఁ గల్గినయదు । వృష్ణిభోజాంధకాన్వయవీరులెల్ల॥

చ॥ నిజగజవాజిరాజి రథనిర్భరసైన్య సమగ్రులై గదా
గ్రజు నిరువంకలన్నిలిచి రామపురస్సరులై వచించిరం
బుజనయనావధూతిలకముం గొని ద్వారకకేఁగుమేమరి
వ్రజములనుక్కడంచి పిదంపంజను దెంచెదమయ్య వీటికిన్॥

వ॥ అనిపలికి కెలంకులం గలకలంబుతోఁ దమ్ముం గ్రమ్ముకొను నమ్మాతుఱరసేద్రైఱం దునిమి దురమ్మునకుం బ్రవర్తిల్లినం భీతిల్లి హతశేషులయిన కన్యారక్షులరిగి భీష్మక రుక్మిప్రముఖులకుం బెండ్లికొడుకైయున్న శిశుపాలునకుం దదుద్వాహనిర్వాహణ సంఘుండగు జరాసంధునకుం దదాప్తులగు పౌండ్రకాదిమహావీరులకు వేర్వేర విన్నవించిన వారు హుతవితతాజ్య ధారాప్రజ్వలిత జ్వలనంబులుం బోలెఁ గుపితులై రోషభీషణారుణాలోకనంబులు కోకనదకదంబంబుల మదంబడంప నితాంతదంత పటపటత్కార వ్యగ్రాత్యుగ్ర వికటభ్రుకుటితటి దుర్నిరీక్ష్యమాణ వదనసమాది తాపార వీరాలాపంబు లేపారఁ దమతమచతురంగ సేనాసనాథదండనాథ యోధ యూధంబుతో రథాధిరూఢులై వెడలి కడలియుప్పొంగినభంగి నింగిన్ గ్రమింగి నలుచెఱంగులం దురంగలించి తరంగితంబగు తురంగఖురజరజోవ్రజంబను నంబుదసమాజంబునందు నటదుద్భటసుభటాయుధచ్ఛటాతటిత్పటలి వెలుంగ నభంగ పటహ శంఖఢమామికా కాహళాది నిర్ఘోషంబులు గర్జావిశేషంబులై యశేష రోదసీగహ్వర బహ్వారాతిమతివిహ్వలత్వంబొనర్ప దర్పంబున నిట్లమ్మహాసైన్యంబు యాదవసైన్యంబుతో నెదుర్కొని యుభయసముద్రంబులుం బోలె నిర్భయ సముద్రేకంబున హలాయుధునితో మాగధుండు నుగ్రసేనుతో భీష్మకుండును శ్రీకృష్ణునితో రుక్మి శిశుపాలురును సాత్యకితో సాళ్వుండును శతద్యుమ్నితో పౌండ్రకుండును విదూరదునితో దంతవక్త్రుండును గదప్రసేనజిత్తులతో విదూరదవేణువారులుం దక్కటిసేనాంగంబులతో సేనాంగంబులును దలపడి యలఘుతర పరస్పర విజిగీషాసంరంభ జంజృంభమాణ బాణాసనకళాకౌశలంబులడరగ నెడలేని పిడుగులజడివడినవడువున శరవిసరప్రసారంబులుం జెడిదంపుటడిదంపుగుంపుల ప్రహారంబులు నపారంబులై మీఱ ఘోరంబగు నప్పోరునంభోరుసంబారు

ధారాళరుధిరపూర ప్రవాహంబులును వాహంబులంబక వ్యూహావిగాహితదేహం
బులై మ్రొగ్గునెడం బడమికిం దిగ్గన డిగ్గురికి నలుకుల నెఱకలంటిననికృత్తగా
త్రంబులగు రాహుత్తుల మొత్తంబులును మొత్తంబుఁ గొల్ప ననల్పశుండాదండ వి
క్షిప్త గదాకాండ ఖండితగండస్థలి నిర్యదసృగ్ధారావహిద్ధవాహిద్ధంబులై జేవురు
కొండలుం బోలె బెండుపడు వేదండ తండంబులపై నుద్ధతప్రదరానువిద్ధశరీరులై
యొరగు నాధోరణుల కరభ్రష్టంబగు కనకసృణివారంబును వారవాణబాణాసన
తూణాదులు దునిసి నంగ్రపాణ ఖేటంబులుఁ గొని యంతకుమున్న విదళితరథాంగ
రథ్యంబులై కదలనియరదంబుల నుండి యిలకురుకు రథికనికరంబులును కరంబులు
శిరంబులు నురంబులు నరంబులుం దెగిన నెగసి సొగసిపడు కాలరులునుం గలిగి కల
హస్థలంబు జలనిధిపగిది నగణితవాహినీపతత్కబంధబంధురంబై మంధరవసుం
ధరాధర పరిభ్రమణంబు క్రమంబున విఘూర్ణితానేక జీవనసత్వంబై కుకవిత్వం
బు తెఱంగునం బరిభ్రష్ట సుకర ప్రాసగణవృత్తంబై చంపకారణ్యంబు మాడ్కి
మూర్ఛాపతిత సారంగంబై నిదాఘదినమధ్యంబునుం బోలె బహుతాపకారి రూ
క్షాళుగ విగళితపత్రరథంబై ప్రవర్తిల్లు నాసమయంబున.

స్రగ్ధరావృత్తము॥ తాలాంకాభీల చాపోద్గతసితవిశిఖధ్వస్తరథ్యధ్వజంబై
నేలం గీలూడి వ్రీలన్ని జరథము వెనండిగ్గుచున్నాగదత్రా
పాలుం డుత్తాలతాలప్రతిమమగు గదం బట్టి బిట్టార్చి సేనా
పాలుర్భీతిల్లఁగాఁ జూపరు వరువఁ బ్రిలంబఘ్ను నిండాఁ కెపీఁకన్॥

మ॥ బలదేవుండు భుజాగ్రజాగ్రదలఘు భ్రాజద్దంద్రిష్ఫచుక్
ప్రబలయోదగ్ర మహోగ్రహుంగ్రి సదృశోగ్రస్ఫాతిఁ సంధిల్లఁ బ్ర
జ్వలితక్రోధ సమేధమానఘన గర్జాకల్ప ఘోరార్భటీ
చలితంబై రిపుసేన బారగఁ జరాసంధున్వెసం దాకినన్॥

సీ॥ అలఘుగంభీర బాహాస్ఫాలనధ్వాన ముఖరితాచలగుహా ముఖచయంబు
ఘనపరస్పర గదాఘట్టనజ స్ఫులింగచ్ఛటా తారకాక్రాంతనభము
మండలభ్రమణ శుంభత్పదాహతి మహాభారఘకత్ఫణోట్ఫణాశతంబు
ఘోరహుంకార విస్ఫారార్భటీదళత్కకుబంతకుంభీంద్ర కర్ణతటము
జంభదంభోళి ఘరణమత్సముయనము। నతిభయాశ్చర్య కలితోభయబలయోధ-

# ద్వాదశాశ్వాసము.

మగుచుఁదద్వీర వరయుగళాహవంబు । దనరెను తైభయుగ్మ యుద్ధంబురీతి॥

పృథ్వీవృత్తము॥ అదల్చి మగధేశ్వరుండలఘువాగదన్ వైచినన్
దదాహతిమఱల్చి రత్నఖచితాంగదాత్మీయదో
ర్గదన్నన గదాగ్రజాగ్రజుఁడు వైవనవ్వైరిరో
మ్ముఁదాఁక పృథివింబడెం బొనరుబాధమూర్ఛాగతిన్॥

సీ॥ అట్లుజరాసంధుఁడని మూర్ఛితుండైన నతనిసారథియెత్తి యరదముపయి
నిడుకొనితొలఁగించి యేఁగుటఁగని తదీయచమూపతులు పలాయనము నొంది
రంగవంగాది సైన్యములు సాళ్వాదులు సాత్యకిచేఁ బరాజయము గాంచి
రాబలభద్రసాత్యకులు శంఖములొత్తిరమ్మహాధ్వనిఁ గృష్ణుఁడాలకించి
యపుడు మగధాదినృప పలాయనమునెప్పు । మించిచిందంబుఁదాను పూరించెశౌరి
విశిఖవిద్ధాంగులగుచు రుక్మిశిశుపాలు । రాత్మరథములఁ బడిరిమూర్ఛాప్తినొరగి॥

క॥ వారిటుమూర్ఛిలుటయుఁద । త్సారథులు దయాళువైన శౌరియనుజ్ఞ
దేరులుమఱల్చితొల్లిటి । దారిందోలిరటుపఱచెఁ దత్సైన్యములున్॥

మ॥ ఇటుచెల్లాచెదరై సమస్తరిపుభూభృద్వీరసైన్యంబులో
క్కటఁబాయన్ బలరామసాత్యకి పురస్కారాప్తమాయాదవో
త్కటసేనావళితో జయేందిరగతిం గన్యామణింగొంచు నా
దటనాద్వారకకేఁగెఁగృష్ణుఁడు మహోత్సాహంబు సంధిల్లగన్॥

క॥ సురపతిపనుపునద్వారక । కరుదెంచిగురుండు పరిణయముహూర్తంబున్
హరికేకతమునదృగ్గో । చరుఁడైయెఱిఁగించిదివికి జనియెన్వేగన్॥

ఉ॥ యాదవవంశవృద్ధులగు నానకదుందుభి ముఖ్యులెల్లదా
మోదరుపెండ్లికై శుభముహూర్తము నెంచిసమస్తబంధుమి
త్రాళిఁబిల్వనంపిరి నిజాప్తులభృత్యులఁ బంచిరుత్కటా
మోదమెలర్ప నంతిపురముం బురమప్పుడలంకరింపఁగన్॥

వ॥ అట్లుపంచిన.

లయవిహారి॥

మృగమదములత్తరులు సగరుసుఁబునుంగు ఘుమఘుమవలువఁగా రాచ నగరలిక్కెల్లన్
ధగధగనిరతనాల సొగసుగలమొగరాలఁ దగుగవిసెనలుదిగిచి రొంగిజిగివెలుంగన్

దాఁగలవారచట్టు పెనుజగిలెలనలత్తుకలఁ దాఁగరుటిడువులుదిద్ది రగణితపువన్నెన్
మిగులఁదెలిముత్తెముల తెగలఁబలుఁబ్రముగ్గిడిరి నిగనిగనినీలములఁ బగుగడపలందున్।

పద్మనాభవృత్తము.

శృంగాటకప్రాంగణద్వార భాగంబులిందీవరాబ్జ స్ఫురత్తోరణాళిన్
శృంగారసౌధాగ్రిముల్ గోపురంబుల్ రథీన్నూతనశ్వేత కేతుప్రశస్తిన్
రంగారుమేల్కట్లుల్వ కూటంబులున్నాట్యరంగంబులు న్మౌక్తికోల్లాభశోభన్
తుంగంబులౌ చంద్రశాలాదులున్ స్వర్ణతోయస్ఫురచ్చిత్ర శిల్పాళినొప్పెన్॥

మ॥ అమితప్రాభవశోభతో భరితరత్నాలంకృతిస్ఫూర్తితో
సమదేభాశ్వ శతాంగసంఘములతో సన్నద్ధులైబంధుభూ
రమణుల్వచ్చిరి వేడ్కఁగృష్ణుని జగద్రక్షాధురీణున్శర
త్కమలాక్షు న్నవమోహనాంగుని లసత్కళ్యాణుసేవింపగాన్॥

క॥ ఇలఁగలబ్రాహ్మణక్షత్రియ। కులవర్యులు వైశ్య శూద్ర కులముఖ్యులును
జ్వలతేజోధనులగుమును। లెలమిన్వచ్చిరిశుభాంగుఁ గృష్ణునిఁ జూడన్॥

గీ॥ యదువిభునియాజ్ఞచే సత్యకాత్మజుఁడపు। డందరినిసముచితక్రియ నాదరించి
తగినచోటులనునిచి యుద్వాహయోగ్య। సకలసంభారపూర్ణత సంఘటించె॥

వ॥ ఇవ్విధంబున వినూతనమణికేతన సంకేతనానానికేతనస్ఫీత నభోంతరంబును క
ర్బురస్ఫురిత సౌధయూథోపరిపరితఃపరీతయావత పళక్షావళీక్ష వీక్షాసదృక్షకై
రవేందీవరతోరణ మాలికాలాలితప్రతోళికంబును వివిధదేశాగత సకలనృపకుల
బలకలకలంబుననగు నప్పురాభ్యంతరంబునందుం బురందరపురోహిత నిరూపిత
శుభలగ్న సమయంబగుటయు శూరసేనోగ్రసేన వసుదేవాద్యనుజ్ఞాతుండై దేదీ
ప్యమాన శుభాలంకారాలంకరిష్ణుండగు శ్రీకృష్ణుండు శృంగార చిత్రరంగాకలి
తరంగవల్లీవేల్లితంబును శశికాంతభిత్తిబింబిత కనకకదళికాస్తంభసంభరితపట్టాం
బరవితానానుషక్త ముక్తాఫల స్వచ్ఛగుచ్ఛాంతరాంతర పరిణద్ధ శుద్ధమరకత మణి
పూరతోరణ దామాభిరామంబును కుంకుమ సంకుమద మృగమదాగరుగంధసా
రగంధరాజాదిసుగంధ బంధురంబును పురంధ్రీజనానీతశాతకుంభ పూర్ణకుంభా
ది శోభితంబును వరాంగనా కరాంగుళీ గృహీతమణిభాజన నీరాజన విరాజమా
నంబును నగు వైవాహిక భవనాంతరంబుఁ బ్రవేశించియందు నిందూపల సందీపి

త భద్రవేదికోపరి కురువింద చరణచంక సత్కనక విష్టరపరివిష్టుండై గర్గనార
దాది మునిప్రవరపురోధస్స్విరాశీర్వాద నాదంబుతోఁ బొత్తుపడు ముత్తైదువల ల
క్ష్మీనారాయణ కళ్యాణంపుపాటల కలస్వరంబుఁ కనుంగులగునుపాంగ మృదం
గ కేణువీణా కాహళాది మంగళ ఘోషంబులం గప్పియుప్పరంబునం గ్రందుకొ
ను దివిజదుందుభిస్వనంబులు సలంగనభంగ శృంగార రసతరంగితాపాంగ విలో
కనప్రసారంబులంబిసాళించు నాకౌకఃప్రవర్తితానల్పకల్పకుసుమాసారమామారంద
రసానందన్మిళిందవారంబులఝుంకారంబులకనుకారంబులగు నానటద్వైమానికమా
నినీమధురగానంబులెసంగ మంగళాధి దేవత తెఱంగున నవ్యాంగరాగ దివ్యాభ
రణ భూషితయుం బుణ్యాంగనానీతయు మదనమంత్రాధి దేవతపగిది నగణ్యతా
రుణ్యలావణ్య మాన్యయు సువర్ణాకీర్ణభద్రాసనాసీనయునై సాక్షాల్లక్ష్మీరూపి
ణి యగు రుక్మిణికిమాంగళ్యతంతు సంధానాది వైవాహికవిధుల నెఱపునపుడవ్వ
ధూవర మిథున విలాసంబు మిథున విలాసంబునుం బోలె బుధానంద మందిరంబై
నందమందిరంబునుంబోలె హరివినోదకరాధికానవరత విభవంబై భవతనూవి
లసనంబునుంబోలె దృశ్యమాన స్త్రీపుంభావ సంభాసమానంబై సమాన సౌందర్య
ధుర్యంబై మర్త్యగణస్తుత్యంబయ్యునమర్త్యగణస్తుత్యంబై విలసిల్లుచుండ॥

గీ॥ వేశ్కనైదువజవరాండ్రు వెల్లపట్టు । తెరను సడలింప నపుడు సతీలలామ
మోముగనుపట్టె శారదాంబుధరము నెడ । బాసిదీపించుచంద్రబింబంబుపోలె॥

చ॥ తననఖరాంకురద్యుతులు తత్కబరీ పరిణద్ధకల్పసూ
ననివహకాంతులంబొదువ నమ్రతదీక్షణ భృంగసంగముల్
దనచరణాంబుజద్వయిని దార్కొని నిల్వనమూల్య రత్నభా
క్కనకపుఁ దాళిబొట్టుతఁగట్టెనొయారికి శౌరికూరిమిన్॥

ఉ॥ వాలుగమీలఁబోలు నిడువాలుకనుంగవ డాలునాథు దృ
క్పాళికెదుర్కొనంగఁ గరకంకణము ల్మొరయన్ దరస్మిత
శ్రీలలితోన్ముఖాబ్జయయి చెచ్చెర నెచ్చెలు లూతనీయఁగో
పాలుని మాళినించెఁ దలప్రాలురహిన్ జవరాలు మేలుగాన్॥

క॥ శౌరినవాంజలి ముక్తము । లైరమణి ఘనాలకరుచి నంటినలుపుతై
సారెకుముత్యములాస్యము । పైరాజిలెఁ దమిన్ గ్రమ్ముభసలముల క్రియన్॥

సీ॥ బలుకను తైపుండల బాళిల్వోయవలరిరి తతకోరకిత లతాతరులభంగి
వలగొని మ్రొక్కిలాజల రాజిఁ బ్రేల్చికొల్చిరవీతిహోత్రునంచితచరిత్రు
ద్విజనతీఘటితనవీనాశుకగ్రంధికలనతో నెనసి రౌత్కంఠ్యగరిమ
మొగినరుంధతికిఁ గేల్మోడ్చి వీక్షించి రూర్ధ్వపదసంపాదినౌత్తానపాది
సకలముని విప్రులొసఁగు సేసలనుదలలఁ దాల్చి వారలకెఱఁగి రుత్సవమెసంగ
మంగళారాత్రికములు దివ్యాంగనలిడ । నందిరా దంపతులు బంధుబృందమలర॥
చ॥ అమృతసమాన్నదానములనందఱికిం బరితృప్తిఁ జేసిర
త్నమయవిభూషణాంబర రథద్విరదాశ్వ ముఖోపదావిధా
నముల సమస్తబాంధవజనప్రముదంబొనరించి విప్రవ
గ్గణమునకు వాంఛితార్థములఖండముగానిడె శౌరిపేరిమిన్ ॥
క॥ హరిమఱియునొసఁగె భూసురవరులకు గురునైచికి సువర్ణాళి ధనో
త్కరములమణిసరములనం । బరములనిడె సూతవందిమాగధతతికిన్ ॥
శా॥ కళ్యాణోత్సవమీగతిం ద్రిజగతీ ఖ్యాతింబ్రవర్తిల్లస
త్కళ్యాణాస్పద పుత్రదంబగు ముహూర్తంబందురత్నస్ఫుర
త్కళ్యాణాద్రి సమానసౌధమున శృంగారంబు పొంగారఁద
త్కళ్యాణీమణి నాథుఁగూర్పఁగ సఖుల్ హైవేసి బల్వేడుకన్ ॥
క॥ అందుఁగల చంద్రశాలిక । యందలి చిత్రములు జూపువ్యాజంబునన
య్యిందీవరనయనామణి నందఱుఁదోఁచుకొని యేఁగిరందులకెలమిన్ ॥
ఉ॥ మేలిమికీలుబొమ్మల గమిందమిగొల్పెడు పొల్పు దెల్పను
ద్దీలాగిముద్దులాడెను రతింగళహుంకృతులూన రత్నల
క్ష్మీలసమానకుడ్యతట చిత్రితదంపతిబంధభేదవా
చాలమునైనకీరికలు శారికలావజముల్ రచింపఁగన్॥
ఉ॥ అచ్చపువజ్రదర్పణము లంబుజరాగ మణీప్రదీపము
లచ్చలకోళ్ళ మేల్పకినెలందగు పందిరిమంచముల్ మణుల్
గ్రుచ్చినజాలవల్లికలు కొంబునుగు స్వరిణల్కలాంచిక
లచ్చపసిండిగిండులడపంబులుమున్నుగ జెన్నుమీరగాన్॥
సీ॥ పగడాలనగు బాలపడలీలనెలరాల తిన్నియ యల్కెంపురా తిన్నియలుగ

ప్రీతిలేనినునుమేని ప్రభఁబూని మగమానికపుకంబములు పైఁడికంబములుగ
మృదువేణిజిగిపోణిమిసుపాణికట్టాణిజాలరుల్ నీలంపుజాలరులుగ
సొగసైతనరుకేతనగుచేతఁగలధౌతకుడ్యముల్ నవహీరకుడ్యములుగ
మందగమనంబు కేళిహర్మ్యమున నెఱపు । బాలికామణిఁ దెచ్చి గోపాలుహంస
తూలికానల్పతల్పంబు స్రోలనిల్పి । సఖులు మెల్లనఁ జరిగెదుజాడఁ గాంచి ॥

ఉ॥ ఆనఁగరాని నానమది నానఁగ నానవలాబిలాన దా
నాననబోండ్లలోనికి కయంగన రంగుచెఱంగు కేల్గవం
బూనిపదాంగదాదులూగి మ్రోయఁగ గ్రమ్మరివచ్చెఁ బచ్చవి
ల్కాఁడునివిలాసకృత్యమునఁ గ్రమ్మరునమ్మరబొమ్మపోలికన్ ॥

ఉ॥ నెచ్చెలులెల్లఁ గూడి తరుణీమణినంతటనంతనంటనన్
మచ్చికహెచ్చువాక్చతురిమన్ నయముం బ్రియముప్పతిల్లవా
కొల్చుచుఁ గొంకుమాన్పి సిరిగుల్కఁడుసోయగమెప్పఁ గ్రమ్మరం
దెచ్చి ముకుందుముందటను నిల్పి క్రమంబున నేఁగిరందఱున్ ॥

ఉ॥ ఆళులు చన్నపిమ్మటఁ ద్రపాకులతన్ వివశాంగవల్లియై
లాలితకేళికాభవన లక్ష్మిగతింగను పట్టిరత్నపాం
చాలికలందుఁ దానొకతె చాటున నిల్చిన ముద్దరాలికెం
గేలు ప్రవాళలీలఁ దనకేలఁ బ్రియుండటు చాచియంటినన్ ॥

ఉ॥ ఉల్లముఝల్లుమన్ననపుడుగ్మలినూపురకాంచిఘంటికల్
ఘల్లుమనంగఁ గౌన్వణఁకఁ గారుమెరుంగుతెరంగునన్ దనూ
వల్లిచలింపఁగాఁ బెనఁగ వల్లభుఁడల్లలనాలలామన
ల్లల్లనఁ బాన్పుఁ జేర్చె సరసాలపనప్రణయైకచాతురిన్ ॥

సీ॥ హరికరస్పర్శచేననురాగ సాగరంబుప్పొంగెనన ఘర్మముప్పతిల్లఁ
దజ్జలసిక్తగాత్రక్షేత్రమున మొల్చునభిలాషలనఁ బులకాళులొదవఁ
జెలువునినగవువెన్నెలలు పైఁబర్వనాఁ జెక్కుటద్దములు దెల్పెక్కిమెఱయఁ
గర్ణభూషామౌక్తికములుగన్ దళుకులందోఁచె నాశ్రుబిందువులువాడమ
నాకొమరుప్రాయపుంజిగురాకుబోఁడి । వల్లభునితోడమునుపాలవెల్లిసడుమఁ
జిలువరాసెజ్జపైనవశ్రీవధూటి । పోలికం గేళిపర్యంకపాళినలరె ॥

క॥ కలికినును జెళుకుజూపుల । తళతళలకు నెళవులైన తలిరుటలుగుక్రొం
దళుకుబలుములుకులేసెం । జెలువుని పైఁజెలువపైనిఁ జిత్తజుడొకటన్ ॥

సీ॥ చేర్చుక్కరాయిడింజెదరె నీబొట్టంచుఁ గోటఁదిద్దుచును ముంగురులుదువ్వి
చలికెనీమకరికల్ చిత్రిసౌరభమంచు మూర్కొంచుఁ జెక్కులిముద్దులాడి
హృదయంబు మదనాగ్ని నెంతగ్రాగెనొయంచు నెదను జెయ్యిడుచుఁ బాలిండ్లునొక్కి
యొదిగెనీకుచ్చిళ్ళ నొడ్డాణపుంగంటులనికొంగుగొనుచు నీవినివదల్చి
నాదుకౌస్తుభమణియు నీనవ్యరత్న । మాలికానాయకంబు సమంబులగునొ
కావొయనియురమురమునఁగదియఁగూర్చి । కలికినెమ్మేనుఁ జెలువుండు గౌగలించె ॥

సీ॥ చనుగుత్తులకు ముత్తెసరులొత్తునని బిగ్గకాఁగలింతకొకింత లోఁగివెఱచు
దలిరువాతెఱకెక్కుపలునొక్కులు చుఱుక్కుమనగాఢచుంబనంబునకుదళకుఁ
గొసరుముద్దులఁదమ్మిరసమునిద్దపుగెల్లములనద్దఁ గనుమూసి మోముద్రిప్పు
నళుకేలయోచేలయని చాలలాలించి రతివేఁడ మారాడమతినిఁగొంకుఁ
గడఁగినీవివదల్పుచోఁ గరములొడ్డుఁ । దవిలిపావడదివియనూరువులు బెనుచు
నధికలజ్జాభయతిరోహితాత్మమోహ । యైమొగనిపాల బాలనవ్యరతివేళ ।

సీ॥ వలపులింపారమైసొలపు సొంపారమేల్ దలఁపులీడేర వేడ్కలొగిమీఱ
సరులుచిక్కులఁజెందమకులు చొక్కులనొందఁగురులు చెక్కులకందవిరులుచింద
గనువింతలుచెలంగఁ దనుకాంతులుపొసంగఁ జనుబంతులుప్పొంగ నెనరెసంగ
మొలకనవ్వులుగుల్క గళకలధ్వనులొల్కఁ బులకలకుల్కలఁజిల్కఁగళలుబెళ్కఁ
దనుమనఃప్రాణగతులైక్యమునొనరఁగఁ । బరవశతమాయకన్నుదామరలువఱల
నపుడుసమరతిసౌఖ్యాబ్ధినలరుచుండి । రాసతీపతులతులప్రహర్షలీల ॥

వ॥ ఇవ్విధంబునన్ దినదిన ప్రవర్ధమాన సమానురాగంబుల జహదజస్ర భోగంబులం బెంపనింపారు నారుక్మిణీకృష్ణులు ద్వారవతీపురంబున సుఖంబుండిరని జనమేజయునకు వైశంపాయనుండెఱింగించెనని శౌనకాదులకు సూతుండు పలికిన సంతసించుటయు.

మ॥ శ్రితవిద్వజ్జనకల్పకక్షితిజ కాశీవిశ్వనాథార్చనా
ర్పితసౌవర్ణసహస్రపుష్పనిఖిలోర్వీభృత్సభారంగన
ర్తితసత్కీర్తినటీస్ఫుటీకృతగుణశ్రేణీనిజస్వాంతచిం

